జగన్నాథగుప్తగారు, విన్నకోట

వీరిది విశాఖపట్టణము. గొప్పవర్తకులు. సత్యాగ్రహమున పాల్గొన్నారని వీరికి ౧౬ నెలల కఠినశిక్ష విధించిరి.

జగన్నాథరావుగారు, మల్లిమడుగుల

విశాఖపట్టణములో సత్యాగ్రహ మొనర్చినందులకు ౧ సం. ము శిక్ష విధింపబడెను.

జనార్దనరావుగారు, కే

వీరు ఏలూరున ౨-౮-౧౯౩౦ నాడు ౧౪౪ సెక్షనును తిరస్కరించి ౨ ఏండ్లు శిక్ష పడసిరి. (తంజావూరు బోర్‌స్టలుస్కూలులో చదువుట.

జమదగ్నిగారు

సైదాపేటలో ౯-౫-౩౦ నాడు ౧ సం. కఠినశిక్ష విధింపబడెను.

జానకీబాయిగారు, దిగుమర్తి

విశాఖపట్టణముజిల్లా నాయకురాలు. జూన్ నెల ౧౩ వ తేదీ నాడు ఈ మెకు ౬ నెలల కఠినశిక్ష విధింపబడెను.

తాయారమ్మగారు

ఈమె గంపలగూడెం జమీందారుగారి బంధువు. ఈమెకు నెల్లూరున ౨౬-౬-౩౧ నాడు ఆరునెలలుశిక్ష విధింపబడెను.

తిరుమలరావుగారు, మొసలికంటి

కాకినాడ నివాసము. ౨౫-౪-౩౦ నాడు సంవత్సర కఠినశిక్ష వీరికి విధింపబడెను. ఫిబ్రవరి 28 నాడు విడుదల చేయబడిరి.

దుర్గాంబగారు, తూములు

గుంటూరుజిల్లా కావూరులో ఉప్పుసత్యాగ్రహోద్యమమున ౬ నెలల శిక్ష.

దుర్గాప్రసాదరావుగారు, పులగుర్త

వీరిది ధవళేశ్వరము. భీమవరమున అరెస్టు. శిక్ష ఆరు నెలలు.

దుర్గాబాయమ్మగారు, గుమ్మిడిదల

ఈమె వాసస్థలము కాకినాడ. వీరికి ఆంధ్రాంగ్ల భాషలయందు చక్కని పరిచయము కలదు. ఈమె హిందీకూడ నెరుగును. ఇంతకు పూర్వ మీమె కాకినాడలో స్త్రీలకు హిందీ పాఠశాలను స్థాపించి నిర్వహించియుండెను. ఉప్పుసత్యాగ్రహ సందర్భమున మదరాసు కేతెంచి యిచటనే సత్యాగ్రహమును నడిపించిరి. మే నెల ౨౪-వ తేది కాంగ్రెసుప్రచారమునకై వాలాజీపేట ఆర్కాటుపట్టణముల కేగి యట సత్యాగ్రహమును గురించి యుపన్యసించిరి. ఆర్కాటుపట్టణమున నానాటి రాత్రియే నిర్బంధింపబడి వెల్లూరు న్యాయాధికారిచే ౯+౩ నెలలు విడికైదు విధింపబడిరి.

నటరాజన్‌గారు డాక్టరు, పి.

చెన్నపురి శాంతిసైన్యాధిపతి. చెన్నపురిలో వీరి కారుమాసముల కఠినశిక్ష విధింపబడెను.

నమశ్శివయ్యగారు, మన్యం

వీరు ఏలూరు వర్తకులు. మన్యం వెంలింగంగారి [illegible]రులు. వయసు ౧౩ ఏండ్లు: ౮-౮-౩౦ నాడు ౧౪౪ సెక్షనును ధిక్కరించి రెండేండ్లు శిక్షనుపొంది చెంగల్పట్టుస్కూలుకు పంపబడిరి.

నరసయ్యగారు, తోట

బందరు సత్యాగ్రహి. స్వరాజ్యపతాకసంరక్షణయందు కడు ధైర్యసాహసములు చూపినవారు. ౨౧-౫-౩౦ నాడు వీరికి ౧౭ నెలలు శిక్షవిధింపబడెను.

నరసింహంగారు, చెరుకువాడ

౧౯-౪-౩౦ బందరులో నిర్బంధింపబడిరి. ౨౧-వ తేదినాడు వీరికి ఒకసంవత్సరము విడికైదు విధింపబడెను.

నరసింహరావుగారు, కాకుమాను

తెనాలిలో వీరి కొక సంవత్సరము కఠినశిక్ష విధింపబడెను.

నరసింహరావుగారు, జి.

సత్యాగ్రహమునకై గుంటూరులో సంవత్సరకారాగారశిక్ష నందిరి.

నాగేంద్రరావుగారు, కోక

ఆదివెలమకులమువారు. బెజవాడలో జాతీయపతాకము నెత్తినందులకు ఒకసంవత్సరము కఠినశిక్షను పొందిరి.

నాగేశ్వరరావుగారు, ఏ. బి. డాక్టరు

రాజమండ్రి. మదరాసులో అరెస్టుచేయబడిరి.

నాగేశ్వరరావుగారు, యన్

ఏలూరు వర్తకశిఖామణులు. క్రిమినలు లాసవరణ చట్టము ప్రకారము ౬ నెలల కఠినశిక్షను పొందిరి.

నారాయణగారు, జనస్వామి

కొల్లూరు గ్రామనివాసులు. ఉప్పు సత్యాగ్రహమున పాలుగొని ఒకసంవత్సరము కఠినశిక్షను పొందిరి.

నారాయణరాజుగారు, దంతులూరి

భీమవరము తాలూకాబోర్డు అధ్యక్షులు. ౧౦౮ సెక్షను ప్రకారము ఒకఏడాది విడికైదు పొందిరి.

నారాయణరాజుగారు, దండు బి. ఏ. బి. యల్.

౨౩-౫-౪౯ నాడు ౧ సం. విడికైదు.

**పట్టాభిరాములు గుప్తగారు, శ్రీకాకుళపు**

(చీరాల) వీరికి మే ౨-వ తేదీన రెండేండ్ల కఠినశిక్ష విధింపబడెను.

**పాపయ్యచొదరిగారు, వల్లూరి**

బెజవాడలో క్రిమినలు లాసవరణ చట్టము ప్రకారము రెండు ఏండ్లు కఠినశిక్ష విధింపబడెను.

**పార్వతమ్మగారు, పాటిబండ**

గుంటూరు మండలపు ఎనిమిదవ కాంగ్రెసుసంఘ సభ్యురాలు. అరెస్టు ౧౯౩౧. ఫిబ్రవరి ౨ తేది.

**పున్నయ్యగారు, శరణు**

కాంగ్రెసు సభ్యులు. గుంటూరులో ౧౬-౧-౧౯౩౧ అరెస్టు.

**పున్నయ్యశాస్త్రిగారు, జి. వి.**

గుంటూరులో ౧౨-౫-౩౦ నాడు నిర్బంధింపబడి ౧ సం. ము కఠినశిక్షను పొందిరి.

**పురుషోత్తమశర్మగారు, మంగిపూడి**

సత్యాగ్రహ సందర్భమున భీమవరములో ఆరునెలల కఠినశిక్ష పొందిరి.

**పూర్ణానందశర్మగారు, శిష్ట్లా**

వీరిది గుంటూరు. వయస్సు ౧౬ సంవత్సరములు. గాంధీ టోపీల నిషేధమును ధిక్కరించుటచే వీరిపయిన కేసువచ్చెను. అది ౨౫-౧౦-౧౯౩౦. నా డుపసంహరించుకొనబడెను. వీరు అడయారు జాతీయ కళాశాల విద్యార్థి.

**ప్రకాశంగారు, ఆకెళ్ల**

తూర్పుగోదావరిజిల్లాలోని భట్నెవిల్లి వీరినివాసము. ఐ.పి.సి. ౧౧౭ సెక్షనుక్రింద ౨-౬-౩౦ నాడు రెండుసంవత్సరములు కఠిన శిక్ష బొందిరి.

**ప్రకాశం పంతులుగారు, టంగుటూరు**

ఏప్రిలు ౨౩-వ తేదీన సంవత్సరము విడిఖయిదు పొందిరి.

**ప్రభాకరశాస్త్రిగారు, కూచిభొట్ల**

కొల్లూరుగ్రామనివాసులు. శాసనోల్లంఘనమున పాలుగొనిన వారు. వీరికి ఒకసంవత్సరము కఠినశిక్ష.

**బలరామకృష్ణయ్యగారు, దుగ్గిరాల** [బౌద్ధవాఙ్మయ బ్రహ్మ.]

అంగలూరు వీరి నివాసము. సత్యాగ్రహమునకై వీరికి మంగళగిరిలో ఒక సంవత్సరము శిక్ష విధింపబడెను.

**బలరామరెడ్డిగారు, దువ్వూరి**

వీరిది మైపాడు (నెల్లూరుజిల్లా) నివాసము. గ్రామ కాంగ్రెసు సంఘాధ్యక్షులు కూడను. మద్యపాననిషేధనాయకులు. శిక్ష ౨౬-౫-౩౦

**బాపినీడుగారు, మాగంటి**

ఏలూరులో ౧౪-౫-౩౦ నిర్బంధింపబడి ఒక వత్సరము విడిఖయిదు పొందిరి.

**బాలసుబ్రహ్మణ్య గుప్తగారు, మఠం**

వీరిది బెజవాడ. ౧౯౨౧ సం. నుండి కాంగ్రెసుప్రచారము చేయుచున్నారు. అనేక పర్యాయములు చెరసాలకుగూడ వెళ్లినారు. సత్యాగ్రహమునకై ౧-౫-౩౦ తేదినాడు బెజవాడలో నిర్బంధింపబడి ౧ సం. ము విడిఖయిదు పొందిరి.

**భావయ్య చొదరిగారు, చింతమనేని**

ఉప్పుచట్టమును తిరస్కరించి ఒకటిన్నరసంవత్సరము శిక్షను పొందిరి.

**భాష్యంసెట్టిగారు, పి. యస్. డా.**

ఏప్రెల్ ౨౧-వ తేదీన ఆరునెలలశిక్షను పొందిరి.

**మండి మహారాణిగారు**

ఈమె కాన్పూరున జరిగిన అఖిలభారత మహిళా విద్యామహాసభకు అధ్యక్షురాలు.

**మల్లపరాజుగారు, జొన్నలగడ్డ, డా.**

వీరు తూర్పుగోదావరిజిల్లాకు చెందినవారు. ఉప్పుసత్యాగ్రహమున పాల్గొన్నారను కారణమున వీరికి ౨ సంవత్సరముల కఠిన శిక్షయు, వేయిరూపాయల జరిమానాయు విధింపబడెను.

**మల్లావధానిగారు, గరికిపాటి**

ఏలూరు గాంధిపాఠశాల పండితులు. జాతీయగీతములు గదించిరి. ౧౦౮ సెక్షనుప్రకారము వీరికి ౧ సం. ము విడిఖయిదు విధింపబడెను.

**మల్లికార్జునరావుగారు శివలెంక, డా.**

బెజవాడలోని కాంగ్రెసుసంఘమున కధ్యక్షులు. పశ్చిమకృష్ణా జిల్లా సత్యాగ్రహసంఘాధిపతి. జూనునెల ౨౧-వ తేదినాడు వీరికి రెండువత్సరముల కఠినశిక్షయు రెండువందలరూపాయల జరిమానాయు విధింపబడెను.

**మల్లికార్జునుడుగారు, మానేపల్లి**

వీరిది ఏలూరు. వైశ్యకులమువారు. తాడేపల్లిగూడెం సంతలో విదేశవస్త్రములను కొనవద్దన్నందుకు ౮-౬-౩౦ అరెస్టు. శిక్ష ౫ వారములు. (౧౦-౬-౩౦)

**మహాలక్ష్మమ్మగారు, ఓరుగంటి**

నెల్లూరు, ౨౬-౬-౩౦ నాడు ఈమె కారునెలలు శిక్షవిధింపబడెను. విడుదల డిసెంబరునెల ౨౪-వ తేది.

**మీనాక్షీ అమ్మాళుగారు, కె. యస్.**

సిలోనునివాసులు. గౌరవనీయులు కే. నటేశయ్యరుగారి భార్య. సిలోనులో సత్యాగ్రహమును జరుపుటకు చెన్నపట్టణమున ఉప్పుసత్యాగ్రహవిధానమును పరిశీలించుచున్నది.

**యజ్ఞనారాయణగారు, బి. ఏ., బి.యల్., మల్లాది**

వీరు బాపట్లలో అడ్వకేటు. జిల్లాకాంగ్రెసుసంఘమున కుపాధ్యక్షులు. సత్యాగ్రహమునకై వీరికి ౧౮-౫-౩౦ నాడు ఒకసంవత్సరము శిక్ష విధింపబడెను.

**రంగనాయకమ్మగారు, కొమాండూరు**

సంస్కృతహిందీ శిరోమణి కో. గోవిందరాజాచార్యులుగారి పుత్రిక, రాజమహేంద్రవరము. వయస్సు ఆరేండ్లు. నూలువడుకుట యందు నేర్పుగడించినది. నలువదినెంబరునూలు ఈమె వడుకగలదు.

**రంగనాయకులుగారు, పి.**

గుంటూరు వైశ్య యువకులు. వీరు ౧ సం. కఠినశిక్షను పొందిరి.

**రంగనాయకులుగారు, వై.**

చీరాల. ౧౪౪. సెక్షనుక్రింద ఆరునెలలశిక్ష పొందిరి.

**రంగయ్యచౌదరిగారు, ముల్పూరి, డా.**

సంఘసంస్కరణాభిలాషులును దేశభక్తులును నగు వీరు ఏలూరులో ౧౪౪ సెక్షనుక్రింద అరెస్టుచేయబడి ౧ సం. విడిఖైదు పొందిరి.

**రంగయ్యనాయుడుగారు, గద్దె**

౨౧-౫-౩౦. నాడు మదరాసులో ఆరునెలల శిక్షను పొందిరి.

**రంగయ్యనాయుడుగారు, మండపాక**

కాకినాడ వాసము. వీరికి సత్యాగ్రహోద్యమమున ౨౫-౮-౩౦ నాడు సంవత్సర కఠినశిక్ష విధింపబడెను. ఫిబ్రవరి ౨౦ నాడు విడుదల.

**రంగారావుగారు, రావూరు**

తెనాలి రామవిలాససభ మేనేజరు. శాసనోల్లంఘనమునకై వీరికి ఏడాది కఠినశిక్ష విధింపబడెను.

**రఘునాయకులుగారు, గౌడా**

కొవ్వూరుతాలూకాలోని చిన్నాయగూడెము గ్రామమునకు చెందినవారు. వీరికి ౨౪ సం. ములు శిక్ష విధించిరి.

**రత్నమ్మగారు, గొల్లమూడి**

గుంటూరుమండలపు ఎనిమిదవ కాంగ్రెసుసంఘమునకు అధ్యక్షురాలు. అరెస్టు ౧౯౩౧ ఫిబ్రవరి ౨౧-వ తేది.

**రాఘవయ్యగారు, బి. ఏ., బి. యల్., వెన్నెలకంటి**

నెల్లూరు వకీలు. ఆరుసంవత్సరములనుండి మునిసిపల్ కౌన్సిలరుగ నున్నారు. సత్యాగ్రహమున చేరినందులకు ౨౫-౬-౩౦ నాడు వీరికి నాలుగునెలలు విడిఖైదు విధింపబడెను.

**రాజగోపాలాచార్యిగారు, సి.**

అక్టోబరు ౧౦-వ తేది విడుదల. ౨౫-వ తేది మరల అరెస్టు.

**రాజమ్మగారు, రామినేని**

వుయ్యూరు. గుంటూరులో పికెటింగు చేసినందువలన అరెస్టు చేయబడిరి.

**రాజయ్యగారు, సింగని**

144 సెక్షను తిరస్కరించి తొమ్మిదినెలలుశిక్షను పొందిరి.

**రాజుగారు, టి. వి.**

చీరాల వాస్తవ్యులు. తాటిచెట్లు నరకినందుకై అరెస్టుచేయబడిరి.

**రామకృష్ణారెడ్డిగారు, బత్తిన**

అల్లూరు వాస్తవ్యులగు వీరు గొప్పభూస్వాములు. ఉప్పుసత్యాగ్రహము చేసినందులకై వీరికి ౨౬-౫-౩౦ నాడు నాలుగుమాసముల విడిఖైదు విధింపబడెను.

**రామచంద్రరావుగారు యం. ఏ., గజపల్లి**

వీరిది ఏలూరు. ౧౪౪ సెక్షను ప్రకారము ఏలూరులో ఒక సం. ము కఠినశిక్షను పొందిరి. వీరు ఏలూరు పురపాలకసంఘసభ్యులు. ఆంధ్రవిశ్వవిద్యాలయసభ్యులు. పశ్చిమగోదావరిజిల్లా మాధ్యమికవిద్యాసంఘమునకు అధ్యక్షులు.

**రామచంద్రరావుగారు, తల్లాప్రగడ**

ఆంధ్రగీర్వాణ విద్యాపీఠస్థాపకులయిన దే. శే. శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారి కుమారులు. ఉప్పుసత్యాగ్రహము చేసినందుకు మూడుసంవత్సరములు శిక్ష. తంజావూరు బోర్స్టలుస్కూలుకు పంపబడిరి.

**రామజోగారావుగారు, బులుసు**

వ్యాయామశాస్త్రప్రవీణులు. వీరికి మదరాసులో ౧౪౪ సెక్షను నుల్లంఘించినందులకు ౨౬-౫-౩౦ నాడు ౬ నెలల కఠినశిక్ష విధింపబడెను. విడుదల ౧౯౩౦ నవంబరు, ౧-వ తేది.

**రామబ్రహ్మం చౌదరిగారు, వల్లభనేని**

వీరు కృష్ణాజిల్లా గుడివాడతాలూకాజమీ గొల్వేపల్లినివాసులు. భూస్వాములు. వీరికి తాటిగెలలు నరికించినందుకుగా ౨-౫-౩౦ నాడు ౬ నెలలు శిక్షవిధింపబడెను. ౧౫-౧౦-౩౧ నాడు విడుదలచేయబడిరి.

**రామమూర్తిగారు, పోలేపెద్ది**

కొల్లూరు గ్రామ నివాసులు. సత్యాగ్రహులు తయారుచేసిన ఉప్పును కొన్నందుకు ఆరునెలలు శిక్షను పొందిరి.

- మమూర్తిశాస్త్రిగారు, మల్లాది

రాజోలు. ఉప్పుచట్టము నుల్లంఘించినందుకు వీరికి రెండు సంవత్సరముల కఠినశిక్ష విధింపబడెను.

రామమూర్తి సతిగారు, శొంఠి

శ్రీ శొంఠి రామమూర్తిపంతులుగారి భార్య. చెన్నపట్టణమున గౌరవన్యాయాధికారిణిగ నియమింపబడిరి.

రామరావుగారు, కడియాల

వీరిది కానపాడు గ్రామము (పశ్చిమగోదావరి). మైనరు అను కారణముతో రెండుసంవత్సరములు శిక్షవిధించి తంజావూరి బోర్ట్సుల్ స్కూలుకు పంపఁబడిరి.

రామశాస్త్రిగారు, పారనంది కీ. శే.

పర్లాకిమిడిపురవాసులు. సంస్కృతాంధ్రముల రెంటియందును ప్రసిద్ధిచెందిన విద్వాంసులు. అనేకవిద్వత్సభలలో వాదప్రతివాదముల గావించి సత్కారములనందినవారు. కొద్దికాలము పిఠాపురము సంస్థానపు టున్నతవిద్యాశాలలో నుపాధ్యాయులుగనుండి పిదప ౧౯ సంవత్సరములు గౌరవవేతనమును బొందిరి. వీరు పెక్కు గ్రంథములను రచించిరి. శిష్టాచార సంపన్నులు. ఇట్లు తమ జీవితమునంతయు సద్వినియోగము గావించి తుదకు తమ ౭౯ వ సంవత్సరమున ౬-౧౨-౩౦ నాడు ఏవ్యాధియు లేక భగవన్నామసంకీర్తనముజేయుచు పరమపదించిరి.

రామానందచౌదరిగారు, కానూరి (కవుతవరం, కృష్ణా)

౧౪౩ ఐ. పి. సి. ౮౪ సాల్టుఆక్టుక్రింద వీరికి ౧ సం. ము కఠినశిక్ష విధింపబడెను.

రామారావు కుమారి (ఏణాక్షి) గారు యమ్.ఏ.

'షిరాజ్' 'వసంతసేన' చలనచిత్రనాటకములలో నాయిక. మంచి పేరుగన్న నటకురాలు. ఈమె యిటీవల వివాహము చేసికొన్నది.

రామారావుపంతులు సతిగారు, తూము

ఏజెన్సీలో ౧౦ ఏండ్లనుండి కాంగ్రెసు ప్రచారము చేయుచున్నారు. ౧౯౨౨ లో రాజమండ్రి తాలూకా సీతానగరం ఫిర్కాలో పన్నులు నిలుపుదలచేసినపుడు అచ్చట చాలాప్రచారము చేసిరి. ఇపుడు ఏజెన్సీలో ఉప్పు-సత్యాగ్రహ ప్రచారమును చేయుచున్నారు.

రాములు గుప్తగారు,

చీరాల. ఒకసంవత్సరము విడిఖైదు.

లక్ష్మిఅమ్మాళ్ గారు, బి.

డాక్టరు శంకరయ్యరుగారి భార్య. తమిళ కార్యసంఘ సభ్యురాలు. చెన్నపురి-అరెస్టు. ౩-౨-౧౯౩౧ ఆరునెలలు విడిఖైదు.

లక్ష్మికాంతరావుగారు, జె.

గుంటూరుజిల్లాలోని కట్టంపూడి వీరి వాసస్థలము. సత్యాగ్రహమునందు పాల్గొన్నందులకు ౯ నెలలు మూడువారముల శిక్షను పడసిరి.

లక్ష్మిదేవిగారు, డా.

శ్రీ డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారి కుమార్తె. ఈమె లండనుకు పోయి అచట యం. ఆర్. సి. పి., యల్. ఆర్. సి. యస్. పరీక్షలయందు జయమునుగాంచినది. ఎడింబరో మొదలయిన ప్రదేశములయందలి ఆసుపత్రులలో ప్రసూతి విద్యను చక్కగా నేర్చుకొని చెన్నపురికి వచ్చినది.

లక్ష్మినరసమ్మగారు, శృంగారకవి

పడమటి గోదావరిజిల్లా రెండవ కాంగ్రెసుసంఘకార్యకర్తురాలు. అరెస్టు ౧౧-౨-౧౯౩౧. నాల్గునెలలు విడిఖయిదు.

లక్ష్మినరసింహంగారు, పచ్చా

బందరు. ౧౯౩౦ సం.రం మేనెల ౧౧ న మొదలు పదినెలలు శిక్షను పొందిరి.

లక్ష్మినరసింహమూర్తిగారు, తనికెళ్ల కీ. శే.

వీరిది పిఠాపురము. ౧౯౨౦ లో కాంగ్రెసున చేరినారు. తాలూకా కాంగ్రెసు సెక్రిటరిగను, అధ్యక్షులుగను కొంతకాల ముండిరి. ౧౯౨౭ సం. మున ఆంధ్రపత్రికా సంపాదకవర్గమున కొన్ని నెలలు పనిచేసినారు. వీరి పేర పిఠాపురమున నొక బాడ్మింటను టూర్నమెంటు ౧౯౨౮-వ సంవత్సరమున ప్రారంభింపబడినది. అందు గెలుపొందినవారికి ఏటా వెండికప్పులు, వెండిపతకములు, బ్యాట్లు బహుమానముగా నిత్తురు.

లక్ష్మినారాయణనాయర్ సతిగారు, బి. ఏ.,

ఈమె తిరువనంతపురమునందలి సుప్రసిద్ధగాయకశిఖామణి కూతురు. అణ్ణామలై విశ్వవిద్యాలయమున సంగీతపరీక్షయందు కృతార్థురాలయినది. తిరువనంతపురం మహారాజాకాలేజిలో సంగీతోపాధ్యాయిగా నున్నది.

లక్ష్మిపతిశాస్త్రిగారు, పెనుమర్తి

బందరు. ౨౪-౬-౩౦ నాడు ఆరునెలలశిక్ష పొంది విడుదల ౧౯౩౦ సం. డిసంబరు ౨౭-వ తేది.

లక్ష్మిబాయమ్మగారు, ఉన్నవ

వేవరంపాడులో ౧౦-౬-౩౦ అరెస్టు ఆరునెలలు కఠినశిక్ష.

విశ్వనాథంగారు, కొవ్వలి

దేశభక్తులగు శ్రీ కొవ్వలి గోపాలరావుగారికి వీరు సోదరులు. తణుకుగ్రామమున నిర్బంధింపబడి మూడుసంవత్సరములు శిక్షవిధింపబడి తంజావూరు బోర్ట్సులుస్కూలుకు పంపబడిరి.

విశ్వనాథదాసుగారు, బి. ఏ. బి. యల్

మదరాసు శాసనసభలో గంజాం జిల్లా శాసనసభా ప్రతినిధి. శాసనోల్లంఘనోద్యమమున పాల్గొనిననేరమునకై వీరికి ౧ సం. ఖైదు విధింపబడెను.

**విశ్వసుందరమ్మగారు, తల్లాప్రగడ**

శ్రీతల్లా ప్రగడ నరసింహశర్మగారి భార్య. నాలుగు నెలలు విడికైదు. శర్మగారును ౧-౬-౪౦ నాడు ౧ సం. విడికైదు పొందిరి.

**వీరభద్రరావుగారు, వితాల**

వీరిది బాదంపూడి. వీరు తాడేపల్లి గూడెం తాలూకా కాంగ్రెసుసంఘకార్యదర్శి. ౧౦-౬-౩౦ నాడు అరెస్టు అయి ఒక యేడాది విడికైదు శిక్షను పొందిరి.

**వీరభద్రరావుగారు, సిరిపురపు**

బెజవాడలో ౧౪౪ సెక్షను ధిక్కరించి జాతీయపతాకను కట్టినందులకు ౬ నెలల కఠినశిక్షను పొందిరి.

**వీరమాణిక్యంగారు**

ఏలూరు స్త్రీరత్నము. ౬ నెలలు శిక్ష పొందిరి.

**వీరయ్యచౌదరిగారు, పిన్నమనేని**

కురుమద్దాలిలో తాటిచెట్లు నరికినందుకు వీరికి ఆరు నెలలు శిక్ష విధింపబడెను.

**వీరరాఘవశ్రేష్ఠిగారు, నాగసూరి**

నెల్లూరులో ౨౯-౫-౩౦ నాడు శిక్ష. ఒక సంవత్సరము విడికైదు.

**వెంకటకృష్ణయ్యగారు, చల్లా**

గుంటూరుమండలపు ఏడవ కాంగ్రెసుసంఘమునకు సహాయ కార్యదర్శి. అరెస్టు ౧౯-౩౧. ఫిబ్రవరి ౧౭.

**వెంకటకృష్ణయ్యగారు, ముష్టి**

వీరు కొల్లూరుగ్రామవాసులు. సత్యాగ్రహోద్యమమున పాలు కొన్నవారు. వీరికి ఒకసంవత్సరము కఠినశిక్ష.

**వెంకటగిరిరావుగారు, మద్దుల**

భట్టిప్రోలులో సత్యాగ్రహోద్యమమునందు పాల్గొని ౧ సం.ము కఠినశిక్షను పొందిరి.

**వెంకటజోగయ్యగారు, గరికిపాటి**

ఏలూరి జాతీయవిద్యాపీఠమున నుపాధ్యాయులు. తాడేపల్లి గూడెం తాలూకా నల్లజర్లలో తాటిచెట్లను నరికిన నేరమునకు ౧౭-౬-౧౯౩౦ అరెస్టు అయిరి.

**వెంకటదుర్గామల్లికార్జునశర్మగారు, వేము (బెజవాడ)**

౨౬-౫-౩౦ నాడు ౧౮ మాసముల కఠినశిక్ష పొందిరి.

**వెంకటనాగభూషణంగారు, పొణుకుపాటి**

బెజవాడలో క్రిమినలు లాసవరణచట్టము ప్రకారము నిర్బంధింపబడి ౬ మాసముల కఠినశిక్షయు నూరురూపాయిల జరిమానాయు విధింపబడిరి.

**వెంకటప్పయ్యచౌదరిగారు, కాఫ్రారి**

తెనాలిలో శాసనోల్లంఘ నోద్యమమునందు వీరు ౬ నెలల కఠినశిక్షను పడసిరి.

**వెంకటరత్నంగారు, కాకాని**

బెజవాడ తాలూకాలోని ఆకునూరు వీరి వాసస్థలము. అక్రమ సంఘసభ్యులనెడి నేరమునందు రెండుసంవత్సరముల కఠినశిక్ష పొందిరి.

**వెంకటరత్నం చౌదరిగారు, సూరపనేని**

వీరిది కృష్ణాజిల్లా దివితాలూకా పెదసనగల్లు. లవణ శాసనోల్లంఘనము వలన ఆరునెలల ౧౫ రోజులు శిక్షను పొందిరి.

**వెంకటరమణమ్మగారు**

స్కూలు ఫైనలు పరీక్షయందు కృతార్థురాలయి సంక్షిప్త లేఖనమును అభ్యసించి అందును పరీక్ష నిచ్చినది. ఆంధ్రదేశమున సంక్షిప్త లేఖనము నభ్యసించిన స్త్రీ ఈమెయే. ఈమె ఇప్పుడు యల్. యమ్. పీ. చదువుచున్నది.

**వెంకటరమణారెడ్డిగారు, బండి**

నెల్లూరుమండలమందలి గంగపట్టణ మీశాంతిసైనికుని నివాసము. తాటిచెట్లు నరికినందులకు వీరికి తొమ్మిదిమాసముల కఠినశిక్ష విధింపబడెను.

**వెంకటరామయ్యగారు, పోతుకుచ్చి**

(వల్లూరు) వెల్లటూరు రథోత్సవమున అరెస్టు.

**వెంకటరాములుగారు, పెండెం**

వీరిది చీరాల. అఖిలభారత పద్మసాలెయువజనమహాసభాధ్యక్షులు. నెల్లూరుమండలమున కావలిగ్రామంలో ౯-౬-౩౧ నాడు అరెస్టు. ఒక సంవత్సరము విడిఖయిదు.

**వెంకటరావుగారు, కళా**

వీరికి కాకినాడలో ౧౯-౪-౩౦ నాడు ౧ సంవత్సరము శిక్ష విధింపబడెను.

**వెంకటరావుగారు, రావు**

తూర్పుగోదావరిజిల్లాలోని గోరస వీరినివాసస్థలము. గంపలగూడెం కుమారరాజాగారికి వీరు తోడియల్లురు. శాంతిసైనికులకు ఆతిథ్య మిచ్చినందులకై ౨౩-౫-౩౦. నాడు ౧౨౪ ఐ. పి. సి. క్రింద వీరికి ఆరునెలలు కఠినశిక్ష విధింపబడెను.

**వెంకటసుబ్బయ్యగారు, బి.ఏ., బి.యల్. ఓరుగంటి,**

నెల్లూరు. ఉప్పు సత్యాగ్రహనాయకులలో నొకరు. ౬-౬-౩౦ నాడు నాలుగు నెలలు శిక్ష.

**వెంకటసుబ్బయ్య చౌదరిగారు, చేకూరు**

కాంగ్రెసు సభ్యులు. గుంటూరులో ౧౬-౧౧-౧౯౩౧. నాడు అరెస్టు.

**వెంకటసుబ్బారావుగారు, శీరము**

గుంటూరుసత్యాగ్రహనాయకులు. వీరికి సంవత్సర శిక్ష విధింపబడెను.

**వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ధారా**

గుంటూరుజిల్లా ఆరవ కాంగ్రెసుసంఘమునకు కార్యదర్శి. అరెస్టు ౧౯౩౧ ఫిబ్రవరి ౩.

**వెంకటాచలంగారు, వారణాసి**

బందరులో ౧౪౪ సెక్షను నుల్లంఘించినందులకై వీరికి ఆరునెలల కఠినశిక్ష విధింపబడెను.

**వెంకటాద్రిగారు, దుర్భా**

శాసనోల్లంఘన మొనర్చినందులకు ౨౬-౫-౩౦ నాడు వీరికి మూడుమాసముల కఠిన శిక్ష విధింపబడెను.

**వెంకటేశ్వరరావుగారు, గాదిరాజు**

బెజవాడ హిందూస్థాన్ సేవాదళాధ్యక్షులు. క్రిమినలు లా సవరణచట్టము ప్రకారము ౬ నెలలు కఠినశిక్ష విధింపబడెను.

**వెంకటేశ్వరులుగారు, తిరువీధుల**

చీరాలలో సత్యాగ్రహమున పాలుగొన్నందులకు వీరికి సంవత్సరము కఠినశిక్ష విధించిరి.

**వెంకటేశ్వరులుగారు, దువ్వూరి**

ముక్త్యాలవాస్తవ్యులు. సత్యాగ్రహులకు భోజనము పెట్టినందుకు వీరికి ఆరుమాసములు కఠినశిక్షయు వేయిరూపాయలు అపరాధమును విధించిరి.

**వెంకన్నగారు, బోయిన**

వీరు మహాదేవపట్నం నివాసులు. గొల్లకులమువారు. తాడేపల్లిగూడెంసంతలో విదేశవస్త్రముల నమ్మవద్దన్నందుకు ౮-౬-౩౦ అరెస్టు అయినారు. శిక్ష ౫ వారములు విడిపైరు. ౧౦-౬-౩౦.

**వెంకయ్యగారు, చుండూరి**

గుంటూరుమండలపు ఏడవ కాంగ్రెసుసంఘమునకు అధ్యక్షుడు. అరెస్టు ౧౯౩౧ ఫిబ్రవరి ౧౯.

**వేంకటరంగయ్యగారు, మద్ది**

వీరికి గుంటూరులో ఒకసంవత్సరము విడిశిక్షయిదు విధింపబడెను

**శకుంతలాదేవిగారు, వడ్డిపర్తి**

ఈమె బీహారురాష్ట్రములోని ఆడాలోగల క్రైస్తవక బాలికాపాఠశాలలో ఉపాధ్యాయినిగనుండి దేశసేవచేయనుద్దేశముతో నాపదవికి రాజీనామా నిచ్చినది. ఆంధ్రరాష్ట్రములో పలుతావుల కాంగ్రెసుప్రచారము గావించినది. తుదకు మదరాసులో పికెటింగురి చేసినందుకు ౬ నెలల శిక్ష పొందినది.

**శరభరాజుగారు, ఇవటూరి**

పదమూడేండ్లబాలుడు. ఇతనిది ఏలేటిపాడు. మూడేండ్లు శిక్ష. తంజావూరు బోర్స్టలుస్కూలులో చదువుట.

**శర్మగారు, జి. యస్. డా.**

బెజవాడ మునిసిపల్ కౌన్సిలరు. సత్యాగ్రహోద్యమమున పాల్గొన్నందులకు వీరికి ౧౪ సంవత్సరము కఠినశిక్ష విధింపబడెను.

**శాస్త్రిగారు, టి. వి. (నల్లూరు)**

వెల్లటూరు రథోత్సవమున అరెస్టు.

**శాస్త్రిగారు, వి. యల్. బి. ఏ.**

చెన్నపురి ఆంధ్రమండలకాంగ్రెసుసంఘాధ్యక్షులు. ౧౪౪ సెక్షనును ధిక్కరించినందులకు వీరి కారు నెలల కఠినశిక్ష విధింపబడెను. అరెస్టు ౮-౫-౧౯౩౦. విడుదల ౨౩-౧౦-౧౯౩౦.

**శివరామకృష్ణయ్యగారు, రాపర్ల**

కాంగ్రెసు సభ్యులు. గుంటూరులో ౧౬-౧-౧౯౩౧. అరెస్టు

**శివశంకరశాస్త్రిగారు, తల్లావజ్ఝల**

సాహితీ సమితిసభాపతి. సత్యాగ్రహమునకై శిక్షింపబడిరి. శిక్ష ౧౪ సంవత్సరము.

**శేషగిరిరావుగారు, అచ్చంపురపు**

గుంటూరు రెండవ కాంగ్రెసు కార్యసంఘసభ్యులు. అరెస్టు ౭-౧-౧౯౩౧.

**శేషమాంబగారు, కాళంగి**

వైశ్యయువతీ విద్యాలయ స్థాపకులు. ౧౯౩౦ జూలై ౩-వ తేదిని ఈమెకు ఒక సంవత్సరము కఠిన శిక్ష విధింపబడెను.

**శేషయ్యగారు, అవనిగడ్డ**

గుంటూరుజిల్లా ఆరవకాంగ్రెసుసంఘమునకు అధ్యక్షుడు. అరెస్టు ౧౯౩౧. ఫిబ్రవరి ౩.

**శేషురెడ్డిగారు, బండి**

గంగపట్టణము (నెల్లూరు) శాంతి సైనికులు. వీరికి తాళ్లు నరికినందులకై ౭-౬-౩౦ నాడు ౯ నెలలు కఠినశిక్ష విధింపబడెను.

**శేషురెడ్డిగారు, బొమ్మా**

గండవరముజిల్లా కాంగ్రెసుఅధ్యక్షుడు. లవణసత్యాగ్రహసందర్భమున నాలుగునెలలు విడిపైదు పొందెరి. శిక్ష ౨౬-౫-౩౦.

**శ్రీరామమూర్తిగారు, చేబియ్యం**

వీరు ఏజెన్సీ సత్యాగ్రహ దళాధిపతి.

**శ్రీరామమూర్తిగారు, నప్లెల**

బెజవాడలో ౧౪౪ సెక్షనును ధిక్కరించి జాతీయపతాకను బట్టినందులకు ఆరుమాసములు కఠినశిక్షను బడసిరి.

**సత్యనారాయణగారు, తూములూరు**

రెండవకాంగ్రెసుకార్యసంఘ సభ్యులు. అరెస్టు ౧౯౩౧. జనవరి ౭.

**సత్యనారాయణగారు, నరసింహదేవర**

గోదావరిజిల్లాలో ౧౧౭ సెక్షను ప్రకారము ౨½ వత్సరముల శిక్ష పొందిరి.

**సత్యనారాయణగారు, బొలిశెట్టి**

వైశ్యయువకులు. అరెస్టు బెజవాడలో—౧౧ ౬ ౧౯౩౦. రెండుసంవత్సరములు కఠినశిక్ష.

**సత్యనారాయణగారు, ముష్టి**

ఎల్లూరు.. వెల్లటూరు రథోత్సవసమయమున అరెస్టు.

**సత్యనారాయణగారు, రాయప్రోలు**

సారాయిషాపుదగ్గర పికెటింగుచేసినందుకు వీరికి ౬ నెలల కఠిన శిక్ష ౧ నెల విడిఖయిదు విధింపబడెను.

**సత్యనారాయణగారు, సింగని**

౧౪౪-వ సెక్షనును తిరస్కరించి తొమ్మిదినెలలు శిక్షను బొందిరి.

**సత్యనారాయణమూర్తిగారు, కొమ్మారెడ్డి**

ఏలూరువారు. ౧౦౮ సెక్షనును తిరస్కరించి ఒకఏడాది శిక్షను పొందిరి.

**సత్యనారాయణమూర్తిగారు, సామవేదం**

పశ్చిమగోదావరిజిల్లా కో-ఆపరేటివు ఫెడరేషను అధ్యక్షులును దేశారాధకులును నగు వీరు వసంతవాడలో ౧౭ సెక్షను క్రింద అరెస్టు చేయబడి ఆరునెల కఠినశిక్ష పొందిరి.

**సత్యమూర్తిగారు, యస్.**

౧౯౩౧ జనవరి ౧౦ అరెస్టు. ౧౧-వ తేది శిక్ష ౬ నెలలు.

**సత్యవతమ్మగారు, కొండా**

గుంటూరుమండలపు ఎనిమిదవ కాంగ్రెసుసంఘసభ్యురాలు. అరెస్టు ౧౯౩౧ ఫిబ్రవరి ౨౧.

**సత్యవీరభద్రరావుగారు, గరిమెళ్ల**

కాకినాడ. బులుసు సాంబమూర్తిగారి శిష్యులు. ౧౪౪ సెక్షను నుల్లంఘించినందులకై మదరాసులో వీరి కారునెలల కఠిన శిక్ష విధింపబడెను.

**సరళాదేవిగారు**

గంజాంజిల్లా. బరంపురములో అరెస్టుచేయబడిన ఉత్కళస్త్రీ. ఆరుమాసముల కఠినశిక్ష పొందిరి. విడుదల నవంబరు ౨౭-వ తేది.

**సరస్వతి అమ్మాళుగారు**

మదరాసులో శాసనోల్లంఘన మొనర్చి ఆరునెలలు విడిఖయిదును బొందిరి.

**సాంబమూర్తిగారు, బులుసు**

౧౯-౪-౩౦ నాడు సంవత్సరశిక్షను పొందిరి.

**సాంబయ్యచౌదరిగారు, అప్పసాని**

శాసనోల్లంఘనోద్యమమున తెనాలిలో వీరికి ఆరునెలలు కఠిన శిక్ష విధింపబడెను.

**సాంబశివరావుగారు, దిగుమర్తి**

రాజమహేంద్రవరము. మలయాళ దేశమున కళ్లికోటయందు స్థాపితమయిన కేరళసోపు ఇన్‌స్టిట్యూటునందు రెండేండ్లు పెక్కురకముల సబ్బులు తయారుచేయుటకు నేర్చుకొన్న పరీక్షయందు అగ్రస్థానము నలంకరించిన ఆంధ్రులు వీ రొక్కరే.

**సుందరంగారు, పి. ఏ.**

చెన్నపురిలో పిక్కెటింగు చేసినందులకు అరెస్టు ౭-౨-౧౯౩౧. శిక్ష ఆరునెలలు.

**సుందరమ్మగారు, పాదర్తి**

ఆగస్టు ౭-వ తేదీనాడు వీరు అరెస్టయిరి. ౨౬-వ తేది నాడు వీరికి ఆరుమాసములు విడిఖైదు విధించిరి.

**సుందరరామరాజుగారు, కలిదిండి**

వీరిది కేశవరం. నల్లజర్లలో ౧౧-౬-౩౦ ఈతచెట్లు నరికినందులకు అరెస్టుచేయబడిరి.

**సుబ్బమ్మగారు, దువ్వూరు, దేశబాంధవి**

ఈ సుప్రసిద్ధదేశభక్తురాలిని రాజమండ్రిలో మే ౩౧-వ తేది నాడు అరెస్టుచేసి ఆరునెలలు విడిఖైదు విధించిరి. విడుదల నవంబరు ౨౧-వ తేది.

**సుబ్బరాజుగారు, నడింపల్లి**

వీరిది కోడూరుపాడు (తూర్పుగోదావరి). సత్యాగ్రహుల నింట జేరదీసినందుకై వీరికి ఆరుమాసములు కఠినశిక్షయు ౧౦౦ రూ. లు జరిమానాయు విధింపబడెను.

**సుబ్బరామరెడ్డిగారు, లేబూరి**

వీరి నివాసము బుచ్చిరెడ్డిపాళెము. నెల్లూరుజిల్లా సమరసంఘ సభ్యులలో నొకరు. ఉప్పుసత్యాగ్రహమునకై నాలుగునెలల విడిఖైదు పొందిరి.

**సుబ్బరాయగుప్తగారు, కోవూరి**

అరువదియేండ్లవయస్సు. వీరికి ౧ సంవత్సరము కఠిన శిక్ష విధింపబడెను.

**సుబ్బరావుగా౯, అన్నవరపు**

బెజవాడలోని వైశ్యప్రముఖులు. సత్యాగ్రహమునకై రెండు సంవత్సరముల కఠినశిక్షను బొందిరి.

**సుబ్బరావుగారు, వక్కలంక**

అమలాపురము కోనసీమ కో-ఆపరేటివుబ్యాంకు డైరెక్టరు. మదరాసులో పికెటింగు చేసినందులకు నిర్బంధింపబడిరి.

**సుబ్బారావుగారు, బి. డాక్టరు**

యూత్ లీగు రాజకీయశాఖకు సెక్రిటరి. చెన్నపురిలో ౧౪౪ సెక్షనును ధిక్కరించినందున వీరి కారునెలల కఠినశిక్ష విధింపబడెను.

**సుబ్బారావుగారు, డి. వి.**

ఏలూరు నివాసులు. మదరాసులో ౧౪౪ సెక్షను నుల్లంఘించినందులకు వీరి కారునెలల కఠినశిక్ష విధింపబడెను.

**సుబ్బారావుగారు, జే. వి.**

సత్యాగ్రహమునకై గుంటూరులో ఒకసంవత్సరము కారాగారశిక్షనందిరి.

**సుబ్బారావుగారు, పాలడుగు**

బందరు వాస్తవ్యులగు వీరికి ౧౪౩, ౧౪౫, ౧౮౫. సెక్షనుల క్రింద ఒకసంవత్సరము కఠినశిక్ష విధింపబడెను.

**సుబ్రహ్మణ్యంగారు, కైప.**

కడపజిల్లా-ఉప్పు సత్యాగ్రహనాయకుడు. శిక్ష రెండేండ్లు.

**సుబ్రహ్మణ్యంగారు, బ్రహ్మజోస్యుల. డాక్టరు**

౧౯-౪-౩౦. నాడు సంవత్సరశిక్ష.

**సుబ్రహ్మణ్యం శ్రేష్ఠిగారు**

గంగపట్టణము (నెల్లూరు) శాంతిసైనికులు. తాళ్లు నరికినందుకు వీరికి తొమ్మిదినెలలు శిక్ష విధింపబడెను.

**సుభద్రమ్మగారు, పి.**

బెజవాడలో నిర్బంధింపబడి ఆరునెలల విడిఖయిదు పొందిరి.

**సూరమ్మగారు, జయంతి**

గంజాముజిల్లా ఉప్పుసత్యాగ్రహములో ఆరునెలలు శిక్ష ననుభవించిరి. వీరు శ్రీ జయంతి వెంకటనారాయణగారి సతీమణి. అరెస్టు జూన్ ౧౯ తేది.

**సూరయ్యచౌదరిగారు, కొల్లిపర**

కపిలేశ్వరపురమునందు తాళ్లు నరికినందుకు వీరికి ౯ మాసములు కఠినశిక్ష విధించబడెను.

**సూరిశాస్త్రిగారు, పురాణం**

బందరు. ౧౯-౫-౩౦ నాడు ఆరు నెలలు కఠిన శిక్ష.

**సూరిశాస్త్రిగారు, వంక**

ఏలూరు వాస్తవ్యులు. ౧౦౮-వ సెక్షనుక్రింద వీరికి సంవత్సరము విడిఖయిదు విధింపబడెను.

**సూర్యనారాయణ చౌదరిగారు, దేవినేని**

వాసస్థలము కొవ్వలి (పడమటిగోదావరి). క్రిమినలు లా సవరణ చట్టముక్రింద వీరికి ౬ నెలలు శిక్ష విధింపబడెను.

**సూర్యనారాయణమూర్తిగారు, దేవులపల్లి**

వీరు రాజోలుతాలూకా కాంగ్రెసుసంఘాధ్యక్షులు. జిల్లా కాంగ్రెసుసంఘకార్యనిర్వాహకసభ్యులు. వీరికి ౧౫-౬-౩౦ నాడు ౨½ సంవత్సరములు శిక్ష విధింపబడినది.

**సూర్యప్రకాశరావుగారు, పాలకోడేటి**

రాజమహేంద్రవర నగర కాంగ్రెసు సంఘకార్యదర్శి. ఉప్పుసత్యాగ్రహ మొనర్చినందుకు వీరికి ౨½ సంవత్సరముల కఠినశిక్ష విధింపబడెను.

**సూర్యప్రకాశరావుగారు, భట్టిప్రోలు**

(చీరాల) మే రెండవ తేదీన వీరికి రెండేండ్లు కఠినశిక్ష విధింపబడెను.

**సూర్యరావుగారు, కడియాల**

పడమటిగోదావరిజిల్లాలోని కానుపాడు గ్రామము వీరి వాసస్థలము. ఈతచెట్లు నరికినందునను మైనరు అయినందునను రెండు సంవత్సరముల శిక్ష విధించి బోర్స్టలు (తంజావూరు) స్కూలుకు పంపబడిరి.

**సోమయ్యగారి సత్తి, చేబియ్యం**

వీరు ఏజెన్సీలో ౧౦ ఏండ్లనుండి కాంగ్రెసు ప్రచారము చేయుచుండినవారు. రాజమండ్రి తాలూకా సీతానగరం శిబిరములో సన్నాలు నిలుపుదలచేసినపుడు అక్కడ చాలపనిచేసినారు. ఇప్పుడు ఏజెన్సీలో ఉప్పు సత్యాగ్రహ ప్రచారమును చేయుచున్నారు.

**హనుమంతరావుగారు, టంగుటూరు**

శ్రీ టంగుటూరు ప్రకాశం పంతులుగారి కుమారుడు. అరెస్టు ౧౨-౬-౧౯౩౦. శిక్ష ఒకఏడాది.

**హనుమారెడ్డిగారు, గండవరపు**

మైపాడు శిబిరశాంతిసైనికదళపతి. ఆరునెలల కఠినశిక్షను పొందిరి.

**హరిహరరావుగారు, సూరంపూడి**

తూర్పుగోదావరిజిల్లా.

**భిషగ్వర్. డా॥ యస్. రాజారామారావుగారు, ఎ.యల్.ఎ.సి.**

వీరు చిన్ననాటినుండి పెక్కేండ్లు హైదరాబాదులో ఆంగ్ల, ఉరుదు, ఆంధ్రవిద్యల నభ్యసించి, నిజాము సర్కారువారి ఉద్యోగములు కొంతకాలము చేసి, ఆయుర్వేద కళాశాలలో ఆయుర్వేదవిద్య నభ్యసించి, భిషగ్వరఅను బిరుదునుబడసి లోకలుబోర్డులో చేర్మను మున్నగు పదవులను గడించి సుమారు పండ్రెండుసంవత్సరములనుండి సేవాస్థానం వైద్యులుగాను స్వంతముగాను వైద్యముచేయుచున్నారు. వీరికి ఆంధ్రనాటకములందు మిక్కిలి ఉత్సాహము. వీరు ధరించు పఠాణి రుస్తుం, తానీషా మొదలగు మొగలు చక్రవర్తుల పాత్రములు చూడదగినవి.

**శ్రీయుత. ఆత్మకూరి హనుమంతరావుగారు, తిరుపతి.**

వీరు బాల్యమునుండి ఆంధ్రనాటకరంగమునందు మిక్కిలి ఉత్సాహముతో రంగస్థలమునకు వన్నెగలిగించుచున్నారు. వీరి భావప్రకటన, పాత్రమునకు దగినగానము, భావ వీటికేలాటి కళంకముండదు. వీరు కొందరిని అచ్చటచ్చట నటకులనుకూడ తయారుచేసి పేరుగాంచినారు.

**యస్. యన్. మరియప్పగారు,**

పలువిధములగు వస్త్రములు తయారుచేయుటలో పేరుగాంచినవారు. మదరాసులోని గురుబసవకంపెనీలో ఏజంటు. మదరాసు వీరశైవసంఘకోశాధికారి.

శ్రీ శివాభ్యాం నమః

# శ్రీ ప్రజోత్పత్తినామ సంవత్సర సిద్ధాంత పంచాంగము

శ్లో. శ్రీకల్యాణగుణావహం రిపుహరం దుస్స్వప్నదోషాపహం, గంగాస్నాన విశేషపుణ్యఫలదం గోదానతుల్యం నృణామ్;
ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతాన సంపత్ప్రదం, నానాకర్మసుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతామ్.







ఈ పంచాంగము

శ్రౌతశైవమార్గప్రవర్తకులు, జోస్యుల వంశార్ణవ పూర్ణశశాంకులు నగు

బ్రహ్మశ్రీ మల్లయారాధ్యులవారి పుత్త్రిండును, బ్రహ్మశ్రీ కుప్పా వేంకటకృష్ణశాస్త్రి,

యీ. నాగేశ్వరశాస్త్రిలుగార్ల ప్రియశిష్యుండును నగు

## కనకయ్య సిద్ధాంతిగారు గణించినది

ఆంధ్రపత్త్రికా ముద్రాశాలయందు ముద్రితమైనది.

## సంవత్సరఫలము

ఈ సంవత్సరమున చైత్ర వైశాఖమాసములయందు అచ్చటచ్చట స్వల్పవృష్టియు, ఎండ వేడిమియు ప్రారంభమై పశ్చిమవాతము హెచ్చుగా వీచును. జ్యేష్ఠమాసమునందును ఎండలు మెండై పడమరగాలివీచును. అధికాషాఢ నిజాషాఢములయందు సస్యానుకూలముగా వర్షించును. శ్రావణ భాద్రపదమాసములయందు సువృష్టిన్ని ఆశ్వీజ కార్తికమాసములయందు వాయుసహితవృష్టిన్ని కలుగును. నవనాయకులలో రసాధిపతిగాక తక్కినవారు శుభులు అవుటచే అన్ని పంటలున్ను బాగుగా ఫలించును. చెఱుకు బెల్లము పొగాకు నెయ్యి రా రసవస్తువులకు ధర లధికముగ నుండును. పూర్వాపరసస్యములు బాగుగ ఫలించును. పశువులు క్షీరప్రదములై సుఖముగ నుండును. ప్రజలు చోర రోగాదులవల్లను, అగ్నివల్లనున్ను బాధలులేక సుఖముగా నుందురు. ప్రజలు రాజులవలన బాధనొందెదరు. అధికాషాఢ బ ౧౦ మొదలు నిజాషాఢ బ ౧౧ వరకు గురు మౌఢ్యము–నిజాషాఢ బ ౬ షష్టి ప్రభృతి ఆశ్వీజ శు ౫ పంచమివరకు శుక్రమౌఢ్యము. చైత్ర, భాద్రపద శుద్ధ పూర్ణిమలయందు సంపూర్ణ చంద్రగ్రహణములున్ను ఫాల్గున శుద్ధ పూర్ణిమయందు ముష్ట్యమానోదయ చంద్రగ్రహణమున్ను పదునాలుగు వీసముల కధికముగా పంటలుపండి నాలుగు తూములవర్షమున్ను కురియును. జ్యేష్ఠ బ ౧౨ లు యమునానదీపుష్కరప్రవేశము.

స్వస్తి సర్వేజనాః సుఖినో భవంతు. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## శ్రీగురుభ్యో నమః.

వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే;
యంనత్వా కృతకృత్యా స్స్యు స్తం నమామి గజాననమ్.

అవాచ్యాత్మస్వరూపాయ శివభావప్రదాయినే;
నమ స్సద్గురునాథాయ షట్స్థలబ్రహ్మరూపిణే

గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్;
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః.

## గురు స్తవము

శ్రీకష్పాన్వయ వారిరాశిశశినౌ కౌండిన్యగోత్రాంచితౌ
విద్యార్థిప్రజవత్సలౌ సుచరితౌ సాంగత్రయీపారగౌ;
రాజద్రాజసుపూజితౌ సవినయం సౌభ్రాత్రభాజౌ గురూ
ప్రాజ్ఞౌ వేంకటకృష్ణనామసుమనోనాగేశ్వరాఖ్యౌ భజే.

## దైవజ్ఞవంశావళిః

శ్రీమజ్జ్యోతిస్స్థలవంశమౌక్తికమణి ర్మాహేశజాబ్యాగణీ
శ్రద్ధాత్రేయమహర్షిగోత్రమహితో మోహాదివిధ్వంసకృత్;
విశ్వఖ్యాతచ నాశ్వలాయనమహర్షిప్రోక్తసూత్రాంచిత
శ్శైవాచారపరాయణో హి కనకారాధ్యస్సముజ్జృంభతే.

తస్య వ్యాత్మభవో భవాంఘ్రి కమలీసద్భక్తికుంభోద్భవో
దూరోత్సారితమూర్తమానసభవో యోగోల్లసత్ప్రాభవః;
వల్లీ లాయుతమల్లికార్జునసమాఖ్యాఖ్యాతదిగ్వైభవో
దేశే మధ్యతనే చకాస్తి పరవస్తూపాస్త్యపాస్తోద్భవః.

తస్యాహం తనయ స్సమిద్ధవినయస్సర్వేశ్వరాంఘ్రిద్వయీ
సేవాసాదితతత్కృపాధిగతసత్యాత్మప్రబోధోదయః,
శ్రీమజ్జ్యోతిషశంత్రవారిధివిగాహోదగ్రశుద్ధాశయ
స్సాధుశ్రీ కనకాహ్వయో వ్యరచయత్పంచాంగ మేత న్ముదా.

## సంవత్సరాది దివసకృత్యము

అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నాన మాచరేత్,
వస్త్రై రాభరణై ర్దేహ మలంకృత్య తత శ్శుచిః.

విఘ్నేశం భారతీం ఖేటాన్ దైవజ్ఞ మభిపూజ్య చ;
సంవత్సరఫలం సమ్య క్ఛ్రుత్వా విప్రాన్ సమర్చయేత్.

ఈ (ఆంధ్ర) దేశమున లోకవ్యవహారముకొఱకు చాంద్రమానాబ్దము గ్రహించునది. శేషాచలమునకు దక్షిణదేశమున సౌరమానాబ్దము గ్రహించునది. వింధ్యమున కుత్తరదేశమున బార్హస్పత్యమానాబ్దము గ్రహించునది. అంతటను గురూదయాబ్దమును గ్రహించునది. ఈ సంవత్సరమునకు చాంద్రమానాబ్దము ననుసరించి ప్రజోత్పత్తిసంవత్సర మని పేరు. సౌరమానము ననుసరించి–చైత్ర శు ౧ మొదలు చైత్ర బ ౧౧ వఱకు ప్రమోదూతసంవత్సర మనియు, అటుపైని సంవత్సరాంతము వఱకు ప్రజోత్పత్తిసంవత్సర మనియు పేరు. బార్హస్పత్యమానము ననుసరించి ఈ సంవత్సర చైత్ర శు ౧ లు మొదలు జ్యేష్ఠ బ ౧౧ వఱకు చిత్రభానుసంవత్సర మనియు అటుపైని సంవత్సరాంతమువఱకు స్వభానుసంవత్సర మనియు పేరు. గురూదయావశేమున–పుష్యాబ్ద మని పేరు.

ఈ ప్రజోత్పత్తినామసంవత్సరమునాటికి

| | |
|---|---|
| సృష్ట్యాదిగత సౌరాబ్దములు | ౧౯౫, ౫౮, ౮౫, ౦౯౨ |
| కల్యాది గతాబ్దములు | ౫౦౯౨ |
| శాలివాహనశకాబ్దములు | ౧౯౧౩ |
| ప్రభవాది గతాబ్దములు | ౫ |
| హూణశకగతాబ్దములు | ౧౯౯౧–౯౨ |
| ఫసలీ | ౧౪౦౦–౧౪౦౧ |
| హిజిరి | ౧౪౧౧ |

అగు చున్నది.

సకలకల్యాణభాజనమైన ఈ ప్రజోత్పత్తినామ సంవత్సరము నాటికి సౌరసిద్ధాంతము ననుసరించి ఆదిసృష్టికర్తయగు బ్రహ్మయొక్క పరమాయువు నందు సగమునకు పైన నొకటవ సంవత్సరమున, మొదటిమాసమున, మొదటి పక్షమున, మొదటి దినమున పగలు, ౧౩ గడియలు ౪౭ విగడియలు గడచినది.

## అబ్దత్రయ ఫలము

### చాంద్రమానాబ్ద ఫలము

శ్లో. సువర్ణం సర్వధాన్యాని సులభాని యయుర్నరాః,
ప్రజోత్పత్తౌ సర్వసంపత్తిః క్షేమారోగ్యం ప్రజాసుఖం.

ఈఫలము సంవత్సరారంభమునుండి సంవత్సరాంతమువరకు జరుగును.

### సౌరమానాబ్ద ఫలము

శ్లో. సువృష్టి స్సర్వదేశానాం ధనధాన్య సమృద్ధయః,
క్షేమం సుభిక్ష మారోగ్యం ప్రమోదే వత్సరే తదా.

ఈఫలము సంవత్సరారంభమునుండి చైత్ర బ ౧౧ లు వఱకు జరుగును. తరువాత సంవత్సరాంతమువఱకు పైనిచెప్పిన చాంద్రమానాబ్దఫలము జరుగును.

### బార్హస్పత్యమానాబ్ద ఫలము

శ్లో. చిత్రార్ఘవృష్టిసస్యాద్యై శ్చిత్రా నిఖిలా ధరా,
నిరామయాఖిలా లోకా శ్చిత్రభాన్వాఖ్యవత్సరే.

ఈ ఫలము సంవత్సరారంభమునుండి జ్యేష్ఠ బ ౧ వఱకు జరుగును. తరువాత సంవత్సరాంతమువఱకు స్వభానుసంవత్సరఫలము.

శ్లో. నందంతీహ జనాస్సర్వే భూమి ర్నానాఫలాన్వితా,
స్వభానువత్సరే భూమి ర్భవతి భూపాలవిగ్రహాః.

ఈ ప్రజోత్పత్తి సంవత్సరమునకు రాజు మొదలైన పరిపాలకవర్గము—తత్ఫలము

### రాజు-శుక్రుఁడు

శ్లో. సమృద్ధ సస్యా వసుధా సువృష్టి
ర్గావో హి సంపూర్ణపయోధరా శ్చ,
ప్రియాః ప్రియాణాం జనయంతి తోషం
కామోపచారై ర్భృగుజేఽబ్దనాథే.

గ్రంథాంతరే:

శ్లో. పేపీయతే మధు మధూ సహ కామినీభి
ర్జేగీయతే శ్రవణహారివ వేణువీణా,
బోభుజ్యతే విబుధస్తు త్వ్యజనై స్సహాన్న
మబ్దేఽపి లభ్య నాదనస్య జనూపభూమౌ.

ఈ ఫలము పాంచాల విదర్భ సౌరాష్ట్ర దేశముల కధికముగా కలుగును.

### మంత్రి-చంద్రుఁడు

శ్లో. సువృష్టిస్సర్వసస్యానాం ఫలితాని భవ తి చ,
క్షేమారోగ్యం సుభిక్షంచ జాయతే శశిమంత్రిణి.

ఈ ఫలము పౌండ్ర కళింగదేశముల కధికముగాఁ గలుగును.

### సేనాధిపతి-చంద్రుఁడు

శ్లో. అతివర్షం చాతివాయు గరోగా స్సుఖినో జనాః,
బహుక్షీరప్రదా గావ శ్చంద్రే సేనాధిపే సతి.

ఈ ఫల మన్ని దేశములకును ప్రాప్తించును.

### సస్యాధిపతి-గురువు

శ్లో. యవగోధూమచణకాః ఫలితాశ్చ భవంతి హి,
పీతధాత్రీ న ఫలితా గురౌ సస్యాధిపే సతి.

ఈ ఫలము ఘూర్జర, యవనదేశముల కెక్కువగా ప్రాప్తించును.

### ధాన్యాధిపతి-బుధుఁడు

శ్లో. మధ్యవృష్టి ర్మందతోయం మేఘా వాతేన పీడితాః,
త్రాస స్సర్వనృపాణాం చ బుధే ధాన్యాధిపే సతి.

ఈ ఫలము సర్వదేశములకును గలుగును.

### అర్ఘాధిపతి-చంద్రుఁడు

శ్లో. సువృష్టి స్సర్వసస్యానా వర్ధిష్ణుర్జాయతే
మహతీ చార్ఘవృద్ధిశ్చ చంద్రే చార్ఘాధిపే సతి.

ఈ ఫల మన్ని దేశములకును ప్రాప్తించును.

### మేఘాధిపతి-చంద్రుఁడు

శ్లో. సువృష్టి స్సర్వదేశానాం ఫలితా ధాన్యజాతయః,
బహుక్షీరప్రదా గావ శ్చంద్రే మేఘాధిపే సతి.

ఈ ఫల మాంధ్రదేశమున కెక్కువగాఁ గలుగును.

### రసాధిపతి-శని

శ్లో. స్వల్పవృష్టి ర్మందసస్యం రసజాతి ధనక్షయః,
మ్లేచ్ఛానాం జాయతే వృద్ధి ర్మందే యది రసాధిపే.

ఈ ఫలము కొంకణ మగధ దేశముల కెక్కువగాఁ గలుగును.

### నీరసాధిపతి-గురువు

శ్లో. పూగీఫలా న్యఖిలరత్న సువర్ణ ధాన్య
కార్పాస చర్మ కుసుమాని చ చందనం చ,
వృద్ధిం యయు ర్ద్విజగణా స్సుఖినో భవంతి
భూమావ నీరసపతౌ సురరాజపూజ్యే.

ఈ ఫలము మాళవదేశమున కెక్కువగాఁ గలుగును.

### పశుపాలకుఁడు-శ్రీకృష్ణుఁడు

శ్లో. పశువృద్ధి స్సుభిక్షం చ బహుసస్యార్ఘ సంపదః,
సంపూర్ణ తృణవృద్ధిశ్చ గోపాలే పశునాయకే.

### స్థానసంరక్షకుఁడు-శ్రీకృష్ణుఁడు

శ్లో. కృష్ణే తు పయసా గావః.

### పురోహితుఁడు-గురువు

శ్లో. విప్రాస్స్వకర్మనిరతా నీరోగా స్సుఖినో జనాః,
గావః కామదుఘా లోకే గురౌ పౌరోహితే సతి.

### పరీక్షకుఁడు-గురువు

శ్లో. పరీక్షకే సురాచార్యే స్సర్వసస్యార్ఘ సమృద్ధయః,
ప్రజానురాగ మన్యోన్యం నీతియుక్తాః పరీక్షకాః.

### గణకుఁడు-శుక్రుఁడు

శ్లో. గణకే భార్గవే లోకే గణకా బుద్ధిసంయుతాః,
వృష్టిసస్యార్ఘవృద్ధిశ్చ సుఖిన స్సర్వజంతవః.

### గ్రామపాలకుఁడు-చంద్రుఁడు

శ్లో. చోరహీనాఖిలాలోకా స్సత్యవాదీ నృపోత్తమః;
ఫలితా వృక్షజాతిస్తు శశాంకే గ్రామపాలకే.

### దైవజ్ఞుఁడు-సూర్యుఁడు

శ్లో. విప్రాస్స్వకర్మనిరతా స్సర్వేషాం సుఖదా నరాః,
రక్తభూమిస్తు ఫలితా రవౌ దైవజ్ఞనాయకే.

ఈ పురోహితాది ఫలములు సర్వదేశములకును వర్తించును.

## మేఘము-వర్షము

ఈ ప్రజోత్పత్తి సంవత్సరమునకు—ఆవర్తనామక మేఘము మేరుశిఖరమున పుట్టుచున్నది.

శ్లో. మందతోయం మహావర్షం సేంద్రచాపం సగర్జితమ్,
వృద్ధిస్స్యాత్సర్వసస్యం చ ఆవర్తే మేఘలక్షణమ్.

## వర్షము-నాలుగుతూములు

శ్లో. చతురాఢక స్సువృష్టిః.

ఫలము : ఇందు పదిపాళ్లు సముద్రమునను, ఆరుపాళ్లు పర్వతములయందును, నాల్గుపాళ్లు భూమిపైనను వర్షించును. ఇట్లు ఇంద్రుడు నియమించినాడు.

## తూముయొక్క పరిమాణము

శ్లో. షష్టియోజన విస్తీర్ణం శతయోజనమున్నతమ్,
ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే.

## వర్షధాన్యాదుల వృద్ధిక్షయములు

వర్షము ౧౧; ధాన్యము ౧౫; శీతము ౧౧; తృణము ౧౫; ఉష్ణము ౭; మారుతము ౯, ప్రజావృద్ధి ౧౯; ప్రజాక్షయము ౧౭; రాజవిద్వరము ౧౭; ఉగ్రము ౧౭; పుణ్యము ౧౭; పాపము ౧౭; వ్యాధులు ౧౫; తచ్ఛాంతి ౧౩; ఆచారము ౧౯; అనాచారము ౧౩; జన్మము ౧౧; మరణము ౯; దేశోపప్లవము ౭; దేశస్వాస్థ్యము ౯; చోరభయము ౧౧; చోరనాశము ౨౧; అగ్నిభయము ౧౭; తచ్ఛాంతి ౭; మృగోపద్రవము ౧౦; మృగక్షయము ౧౫; కీటకభయము ౨౧; కీటకనాశనము ౧౩; మూషకోత్పత్తి ౯; మూషకనాశనము ౧౧; సర్పోత్పత్తి ౨౧; సర్పనాశము ౨౧; కామము ౫; లోభము ౧౯; మోహము ౧౫; మదము ౫; మాత్సర్యము ౯; సుఖము ౧౧; దుఃఖము ౧౧; భోగము ౯; విడంబము ౫; మనోవ్యథ ౧౭; ద్వేషము ౧౧; ప్రతిష్ఠ ౨౧; అప్రతిష్ఠ ౧౩; ద్యూతము ౨౧; మత్తత ౧౧; నరోత్పత్తి ౧౭; స్త్రీయోత్పత్తి ౫; ధాతువాదము ౯; భయము ౧౩; శౌర్యము ౧౭; దుష్టనిగ్రహము ౨౧; శిష్టపరిపాలనము ౭; సత్యము ౯; అసత్యము ౧౧; విశ్వాసము ౧౩; అవిశ్వాసము ౧౫; దయ ౧౭; నిర్దయ ౧౭; న్యాయము ౧౯; అన్యాయము ౧౯; అజ్ఞానము ౭; జ్ఞానము ౧౯; కాపట్యము ౯; నిష్కాపట్యము ౯; ధర్మము ౧౭; అధర్మము ౧౭; గోమాయువృద్ధి ౧౩; తన్నాశము ౧౦; శలభవృద్ధి ౧౩; తన్నాశము ౪; మశకవృద్ధి ౧౬; తన్నాశము ౧౬; మత్కుణవృద్ధి ౭; తన్నాశము ౪; వృశ్చికోత్పత్తి ౧౬; తన్నాశము ౧౬; వ్యాఘ్రవృద్ధి ౪; తన్నాశము ౧౧; సస్యవృద్ధి ౫; తన్నాశము ౬; శుకవృద్ధి ౬; తన్నాశము ౬; పికవృద్ధి ౮; తన్నాశము ౫; కుక్కుటవృద్ధి ౮; తన్నాశము ౮; పతత్రివృద్ధి ౪; తన్నాశము ౬; ధేనువృద్ధి ౨; తన్నాశము ౬; మహిషవృద్ధి ౨; తన్నాశము ౫; మృగవృద్ధి ౪; తన్నాశము ౫; ఛాగవృద్ధి ౫; తన్నాశము ౫; అశ్వవృద్ధి ౫; తన్నాశము ౩; గజవృద్ధి ౬; తన్నాశము ౪; ఉష్ట్రవృద్ధి ౪; తన్నాశము ౪; విప్రవృద్ధి ౬; తన్నాశము ౨; క్షత్రియవృద్ధి ౪; తన్నాశము ౫; వైశ్యవృద్ధి ౩; తన్నాశము ౩; శూద్రవృద్ధి ౬; తన్నాశము ౩; మ్లేచ్ఛవృద్ధి ౩; తన్నాశము ౨; సంకరవృద్ధి ౫; తన్నాశము ౩; వజ్రవృద్ధి ౫; వైడూర్యవృద్ధి ౨; గోమేధకవృద్ధి ౩; పుష్యరాగవృద్ధి ౪; విద్రుమవృద్ధి ౫; మరకతవృద్ధి ౫; మాణిక్యవృద్ధి ౫; నీలవృద్ధి ౫; ప్రవాళవృద్ధి ౫; సువర్ణవృద్ధి ౨; రజతవృద్ధి ౪; తామ్రవృద్ధి ౭; కాంస్యవృద్ధి ౨; లోహవృద్ధి ౮; అయోవృద్ధి ౨; త్రపువృద్ధి ౧౦; సీసవృద్ధి ౧౧; రసవృద్ధి ౬; వ్రీహివృద్ధి ౧౯; శాలివృద్ధి ౧౮; కుళుత్థవృద్ధి ౧౧; తిలవృద్ధి ౧౪; ముద్గవృద్ధి ౧౪; సర్షపవృద్ధి ౬; చణ ౬; మాషవృద్ధి ౬; గోధూమవృద్ధి ౧౮; కోద్రవవృద్ధి ౧౦; ప్రియంగువృద్ధి ౧౬; యావనాళవృద్ధి ౧౮; శ్యామాకవృద్ధి ౧౨; రాజమాషవృద్ధి ౪; నీవారవృద్ధి ౧౬; శింబిధాన్యవృద్ధి ౧౨; అతివృష్టి ౫; అనావృష్టి ౧౫; స్వచక్రభయము ౯; పరచక్రభయము ౩; విద్యుత్తు ౧౧; శిలాపాతము ౭; గర్జితము ౭; అండజములు ౭; స్వేదజములు ౯; ఉద్భిజ్జములు ౧౫; జరాయుజములు ౭; స్థావరములు ౧౭; జంగమములు ౭; ఇతర జీవరాసులు ౧౫.

## మేషసంక్రాంతికాలము-ఫలము

ఈ సంవత్సరమున చైత్ర కృష్ణ ౧౧ ఏకాదశి సోమవారము నాడు, తత్కాలద్వాదశీతిథియందు సూర్యోదయాది ఘ. ౩౯-౩౧ విఘటికలకు సూర్యుడు మేషరాశియందు ప్రవేశించును.

### కాలఫలము

శ్లో. రాత్రౌ చే న్మేషసంక్రాంతి స్సువృష్ట్యారోగ్య సంపదః.

### వారఫలము

శ్లో. సోమవారే సుభిక్షకృత్.

ఈ ఫలము ద్రవిడ గౌడ దేశముల [illegible] నుండును.

## ఆర్ద్రానక్షత్ర కాలము-ఫలము

ఈ సంవత్సరము అధికాషాఢ శుద్ధ సప్తమీ సోమవారము నాడు పూర్వఫల్గుని నక్షత్రమందు సిద్ధనామయోగము గరకరణమున సూర్యోదయాది ఘ ౮-౨౭ విఘటికలకు సూర్యు డార్ద్రానక్షత్రమున ప్రవేశించును.

| | |
|---|---|
| తిథిఫలము: | సప్తమ్యాం క్షేమ ముత్తమమ్. |
| వారఫలము: | సోమవారే సుభిక్షకృత్. |
| నక్షత్రఫలము: | భగర్క్షే శుభదః ప్రోక్తః. |
| యోగఫలము: | సిద్ధియోగే సుభిక్షకృత్. |
| కరణఫలము: | దుర్భిక్షం గరజాహ్వయే. |
| కాలఫలము: | దివార్ద్రా సస్యనాశాయ. |
| గ్రంథాంతరే కాలఫలము | పూర్వాహ్ణకాలే జగతో విపత్తిః. |

భరణ్యాది షణ్ణాంశల ఫలం-అతివృష్టిః

జ్యేష్ఠ శుక్ల ప్రతిపద్యుక్త-సోమవారఫలం

శ్లో. [illegible] తేను మారోగ్యం వృష్టిస్సస్యవివర్ధనీ,
[illegible] నిరతా ధాత్రీ జ్యేష్ఠాహౌ చేందువాసరే.

ఆషాఢ శుక్ల పంచమీయుక్త సోమవారఫలం-అతివృష్టిః

ఆషాఢ శుక్ల నవమీయుక్త స్వాతీనక్షత్రఫలం

శ్లో. ఆషాఢే శుక్లపక్షే తు నవమీ స్వాతిసంయుతా,
[illegible] స్త్ర సంగాతి భూమౌ బీజం న వాపయేత్.

ఆషాఢ కృష్ణచతుర్దశీరోహిణీయుక్త తిథిఫలం

శ్లో. ఆషాఢే కృష్ణపక్షే తు దశమీ రోహిణీయుతా,
సర్వసస్యసమృద్ధిస్స్యా దేశాదశ్యాం తు మధ్యమమ్.
ఈ నాలుగుఫలములు చాంద్రమానమున కెక్కువగా ఫలించును.

కుజచారఫలము

వక్రము లేదు-జ్యేష్ఠ శు రాలు లగాయతు నిజాషాఢ శు 3 లు వఱకు అంగారకుడు సింహరాశియందు సంచరించును. సంవత్సరారంభము నుంచి సంవత్సరాంతమువఱకు కుజుఁడు పుష్యమీనక్షత్ర 3 తృతీయపాదము లగాయతు-ఉత్తరాభాద్రద్వితీయపాదమువఱకు యుద్ధగతిచే సంచారము చేయును.

శ్లో. సింహం గతే క్షితిసుతే యది సింహభాగే
శోషం నయేత్ త్రిదశయకాల ఇవాంబురాశిమ్,
ధీమేంద్రనీలసదృశం ఘనమేఘబృందం
[illegible] కృపణదాన మివాంబురాశిమ్.

శ్లో. చిత్రావిశాఖాతుహినాంశుభేషు
విశ్వంభరాయా స్తనయః ప్రయాతిః,
ధరాం సమస్తా ముదకప్రమగ్నా
ముద్గ్రశస్యాలతనుః కరోతి.

శ్లో. యామ్యసార్ప విశాఖాను త్రిపూర్వేషుచ భూమిజః;
కరోతి మహతీం వృష్టిం వారిపూర్ణా వసుంధరా.

శ్లో. స్వాతీమిత్రేంద్రరౌద్రాహిప్రాజాపత్యోత్తరేషు చ,
సంచరన్ జలదాన్ హంతి భౌమ స్సంవర్తకా నపి.

బుధచారః:—

| | |
|---|---|
| చైత్ర శు ౨ శ పశ్చాదుదయం | వైశాఖ శు ౬ పశ్చాదస్తమయం |
| వైశాఖ బ ౧౨ ప్రాగుదయం | జ్యేష్ఠ బ ౧౨ శ ప్రాగస్తమయం |
| నిజాషాఢ శు ౨ శు పశ్చాదుదయం | శ్రావణ శు ౫ పశ్చాదస్తమయం |
| శ్రావణకృష్ణ ౮ శ ప్రాగుదయం | భాద్రపద బ౧౨ ప్రాగస్తమయం |
| ఆశ్వయుజ బ౧౨ సో పశ్చాదుదయం | మార్గశీర్ష శు౨ సో పశ్చాదస్తమ |
| మార్గశీర్ష బ 3 ఆ ప్రాగుదయం | పుష్య శు బ ౬ ప్రాగస్తమయం |
| మాఘ బ ౧౧ బు ప్రాగుదయం | ఫాల్గున బ ౧౨ సో పశ్చాదస్తమయం |

బుధచారఫలము

శ్లో. ఆర్ద్రాది పితృభాంతేషు దృశ్యతే యది చంద్రజః,
తదా దుర్భిక్షకలహా రోగాణాం చాపి వృద్ధికృత్.
పౌషాషాఢశ్రావణవైశాఖే ష్వీందుజ స్సమాఘేషు,
దృష్ట శ్శుభాయ జగతాం శుభఫలకృ త్త్వస్తగే తేషు.
ఇషోర్జమాసయో ర్వహ్నిశస్త్రదుర్భిక్షకారకః,
ఉదిత శ్శశిజో నౄణా మితరేషు శుభప్రదః.

గురుచారము

గురువు ఈ సంవత్సరారంభమునుండి జ్యేష్ఠ బ ౧౧ లు వఱకు మిథునరాశియందును, అదిమొదలు కార్తిక శు ౭ వఱకు కర్కాటకరాశియందును, అదిమొదలు మార్గశీర్ష నవమివఱకు సింహరాశియందును, అదిమొదలు వత్సరాంతమువఱకు కటకరాశియందు వక్రత్వము చేతను సంచరించును.

శ్లో. సురేంద్రవంద్యే భుని యుగ్మరాశౌ
గతే క్షితీశాః కలహోత్సుకాస్స్యుః,
ఈతేర్భయం శస్త్రభయం నరాణాం
క్వచి త్ప్రవర్ష (తి పయోధరాశ్చ.

శ్లో. బృహస్పతౌ కర్కటరాశిసంస్థే
గావశ్చ మేఘాశ్చ పయోధరాస్స్యుః,
సస్యాభివృద్ధిశ్చ భవేద్ధరిత్ర్యాం
సదా ద్విజాశ్చా ధ్వరతత్పరాస్స్యుః.

శ్లో. సింహరాశిగతే జీవే నిస్వా భూసురసజ్జనాః,
అతివృష్టిర్వ్యాళిభయం నృపా యుద్ధే లయం యయుః.

గురువు మూఁడురాసులయందును సంచరించు ఫలము

శ్లో. ఏకస్మిన్ వత్సరే జీవే రాశిత్రయ ముపాగతే,
తదా వసుంధరా కీర్ణా శవైస్స్వ ప్తకోటిభిః.

శుక్రచారఫలము

| | |
|---|---|
| నిజాషాఢ శు ౬ మంగళవారం | తూర్పున అస్తమించును. |
| ఆశ్వయుజ శు ౫లు | పడమర ఉదయించును. |
| పుష్యమీనక్షత్రమున | అస్తమించును. |
| స్వాతీనక్షత్రమున | ఉదయించును. |

శ్లో. రౌద్రభాది చతుర్థేషు ఉదయే చాస్తగే భృగౌ,
విప్రపీడాః ప్రజాయంతే సస్యవృద్ధిః ప్రజాయతే.

శ్లో. స్వాతీత్రయే భృగోశ్చాస్తే బోధయేచ్చ ప్రవర్షతి,
ఉదయాస్తమయే యాతి శుక్లపక్షే యదాభృగుః.
గజాశ్వరాజపుత్రాణాం శోణితం పిబతే మహీ,
ఉదయాస్తమయే యాతి కృష్ణపక్షే యదా సితః.
గజాశ్వరాజపుత్రాణాం వృద్ధిం ప కురుతేఽన్వహమ్.

### గ్రహణమాసఫలం

శ్లో. పుణ్యాగాంధర్వ వణిజాశ్చ హస్త్యశ్వశిల్పి లేఖకాః,
మోదంతే సంప్రహృష్టాస్సర్వే గ్రహణే సతి చైత్రకే.

శ్లో. మాసుస్థ్వాన చైత్రేషు జ్యేష్ఠశ్రావణమాసయోః,
సర్వగ్రస్తోదర్కః ఇందుర్వా రాజవృత్తినాశకృత్.

### అయనఫలం

సౌమ్యాయనే విప్రభూపాన్ హంతి.

హస్తనక్షత్రమందు గ్రహణము సంభవించుటచే వాయవ్యమండలము-ఫలము

శ్లో. వాయవ్యమండలే గ్రస్తే చోర రోగాగ్నిజం భయమ్,

### వర్ణఫలము

పాంశువిలోహితరూపః క్షుద్భయాయ భవతి వృష్టేశ్చ.

ఈ గ్రహణము అర్ధరాత్రాత్పూర్వము సంభవించుటచేత పూర్ణిమాప్రయుక్తమై శ్రాద్ధములు పగలు రెండుజాములలోగా జరిగించవలసినది.

### కారికావృత్తౌ

శ్లో. యామార్ధ్వం మధ్యరాత్రౌ చ దశర్నే
త్పూర్వం మధ్యాహ్నే న కర్తవ్య మేవ.

నిత్యభోజనము, మూడుజాముముపూర్వోపవాసగా చేయవలసినది.

శ్లో. సంక్రాంతి గ్రహణేయామాః స్త్రీన్ బాలవృద్ధాతురైర్వినా,

కన్యా తులా ధనుః కుంభ మీనరాసులయందు జనించినవారున్ను, హస్త ఉత్తర చిత్త సతభిషములయందు జననమొందినవారున్ను, ప్రకారాంతరముచే కన్యా తులా కుంభ మిథునరాసులయందు జననమొందినవారున్ను శాంతి యథావిధిగా చేసికోవలసినది.



ప్రజోత్పత్తి సంవత్సర భాద్రపద శుద్ధ ౧౫ పూర్ణిమా శనివారమున ఉత్తరాభాద్రా నక్షత్రమున రాహుగ్రస్తమైన ఖచ్ఛన్న (సంపూర్ణ) చంద్రోపరాగము, పింగళవర్ణము.

| | ఘ. వి. | | ఘ. ని. |
|---|---|---|---|
| అస్తాది ఈశాన్య స్పర్శకాలము | ౧౩-౧౫ | రాత్రి | ౧౧-౧౮ |
| నైరృతినిమీలనకాలము | ౧౬-౧౮ | | ౧౨-౨౮ |
| మధ్యకాలము | ౧౮- ౧ | | ౧-౧౨ |
| ఆగ్నేయోన్మీలనకాలము | ౧౯-౪౫ | | ౧-౫౪ |
| బింబాదర్శనకాలము | ౩-౩౦ | | ౧-౫౪ |
| వాయవ్యమోక్షకాలము | ౨౨-౪౨ | | ౩- ౫ |
| ఆద్యంతపుణ్యకాలము | ౯-౨౭ | | ౩-౪౭ |

### గ్రహణమాసఫలము

శ్లో. కళింగ వంగ సౌవీర సౌరాష్ట్ర మ్లేచ్ఛకాన్ నృపాన్,
హంతి రాహుర్నభస్యేథ యోషిద్గర్భ వినాశనమ్.

### అయనఫలము

శ్లో. విట్శూద్రాన్ దక్షిణాయనే హంతి.

### వర్ణఫలము

శ్లో. పాంశువిలోహితరూపః క్షుద్భయాయ భవతి వృష్టేశ్చ.

### గ్రాసఫలము

సర్వగ్రస్తౌ చంద్రసూర్యౌ క్షుద్వ్యాధ్యగ్నిభయప్రదౌ.

ఈ గ్రహణము ఉత్తరాభాద్రానక్షత్రమున సంభవించుటచే వారుణమండలఫలము.

శ్లో. వారుణే సర్వజంతూనాం క్షేమం రాజ్ఞాం మశోభనమ్.

మీన-మేష-మిథున-సింహ-కన్యారాసులయందు జనన మొందినవారున్ను ప్రకారాంతరముగా మీన-ధను-సింహ-మేష రాసులయందు జననమొందినవారున్ను శాంతి చేసికోవలసినది.

పూర్ణిమాప్రయుక్తశ్రాద్ధములు పగలు రెండుజాములలోపుగాను జరిగించుకోవలసినది.



ఈ సంవత్సర ఫాల్గున శు ౧౫ పూర్ణిమా మంగళవారమున ఉత్తర ఫల్గునీ నక్షత్రమున కేతుగ్రస్తమైన మధ్యాహ్నోదయమను పేరుగల చంద్రగ్రహణము ౧౫ విసములపైని గ్రహణము-కృష్ణవర్ణము.

| | ఘ. వి. | | ఘ. ని. |
|---|---|---|---|
| సూర్యోదయాది ఆగ్నేయ స్పర్శకాలము | ౨౫-౫౯ | రాత్రి | ౪-౭౩ |
| మధ్యకాలము | ౨౯-౫౧ | | ౫-౫౬ |
| వాయవ్యమోక్షకాలము | ౩౩-౪౩ | | ౭-౨౭ |
| ఆద్యంతపుణ్యకాలము | ౭-౪౪ | | ౩- ౬ |

### గ్రహణమాసఫలము

శ్లో. పీడాకరం ఫాల్గున మాసి పర్వం
వంగాంగకావంతిక మేఖలానామ్,
స్త్రీజన సస్యప్రభవాంగనానాం
ధనుష్మదుగ్ర క్షేత్ర తపస్వినాంచ.

### అయనఫలము

సౌమ్యాయనే విప్రభూపాన్ హంతి.

### వాయవ్యమండలఫలము

శ్లో. వాయవ్యమండలే గ్రస్తే చోరరోగాగ్నిజం భయమ్.

## వర్ణఫలము

శ్లో. చంద్రసూర్యోపరాగేషు కృష్ణవర్ణేన సంయుతా;
శూద్రాదిష్టం మహార్ఘంచ అతివృష్టిర్నిరంతరమ్.

ఈ గ్రహణమునకు పూర్ణిమాప్రయుక్త శ్రాద్ధములు రాత్రి మోక్షానంతరము చేయవలసినది. నిత్యభోజనమున్నూ రాత్రియందే చేయవలసినది. పగలు చేయగూడదు. పతివిహీన స్త్రీకర్తృక శ్రాద్ధములు ఈ రోజున ఉపవసించి మరునాడు చేయవలసినది.

శ్లో. గ్రస్తే చంద్రే తూదితే తస్య ముక్తిం
దృష్ట్వా తత్ర శ్రాద్ధమన్నేన కార్యం-ఇతి కాలికావృత్తౌ.

కన్యా తులాధనుః కుంభ మీన రాసులయందు జనన మొందిన వారును ఉత్తర-పూర్వఫల్గుని-హస్తనక్షత్రములయందు జనన మొందిన వారును, ప్రకారాంతముగా కన్యాతులాకుంభ-మిథునరాసులయందు జనన మొందినవారును శాంతి యథావిధిగా చేసికొనవలసినది.

## కందాయములు

| అశ్వి | భ | కృ | రో | మృ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్రే | మఖ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౧ | ౩ | ౬ | ౧ | ౪ |
| ౨ | ౦ | ౧ | ౨ | ౧ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ |
| ౩ | ౪ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ |

| పూఫ | ఉఫ | హ | చి | స్వా | వి | అనూ | జ్యే | మూ |
|---|---|---|---|---|---|---|---|---|
| ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ |
| ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ |
| ౭ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ |

| పూషా | ఉషా | శ్ర | ధని | శత | పూభా | ఉభా | రేవ |
|---|---|---|---|---|---|---|---|
| ౨ | ౧ | ౧ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ |
| ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ |
| ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ |

శ్లో. ఆదిశూన్యే మహావ్యాధి ర్మధ్యశూన్యే మనోవ్యథా,
అంత్యశూన్యే ఫలం స్వల్పం త్రిశూన్యే నిష్ఫలం భవేత్.

శ్లో. విషమేష్వర్థలాభస్స్యాత్సమే తు సమతా భవేత్,
శూన్యే శూన్యత్వమాప్నోతి కందాయఫలమీదృశమ్.

## ఆదాయవ్యయములు

| | ఆ. | వ్య. | | ఆ. | వ్య. |
|---|---|---|---|---|---|
| మేషవృశ్చికములకు | ౨ | ౮ | ధనుర్మీనములకు | ౫ | ౧౪ |
| వృషభతులలకు | ౧౧ | ౧౪ | మకరకుంభములకు | ౮ | ౮ |
| మిథునకన్యలకు | ౧౪ | ౧౧ | | | |
| కర్కాటమునకు | ౮ | ౧౧ | సర్వాదాయము | | ౫౯ |
| సింహమునకు | ౧౧ | ౫ | సర్వవ్యయము | | ౭౧ |

## రాజపూజ్యావమానములు

| | పూ. | అ. | | పూ. | అ. |
|---|---|---|---|---|---|
| మేషమునకు | ౧ | ౭ | తులకు | ౫ | ౬ |
| వృషభమునకు | ౪ | ౭ | వృశ్చికమునకు | ౧ | ౨ |
| మిథునమునకు | ౭ | ౭ | ధనుస్సునకు | ౪ | ౨ |
| కర్కాటకమునకు | ౩ | ౩ | మకరమునకు | ౭ | ౨ |
| సింహమునకు | ౬ | ౩ | కుంభమునకు | ౬ | ౫ |
| కన్యకు | ౨ | ౬ | మీనమునకు | ౩ | ౫ |

## సంవత్సరఫలములు

అశ్విని, పుష్యమి, స్వాతి, అభిజిత్తు ఈ నక్షత్రములు ఉపరాగ రాజ్యాధిపతులు

భరణి, ఆశ్రేష, విశాఖ, శ్రవణం ,, సమర్ఘము

కృత్తిక, మఖ, అనూరాధ, ధనిష్ఠ ,, గోహానిరాను

రోహిణి, పుబ్బ, జ్యేష్ఠ, శతభిషం ,, మహాకోపము

మృగశీర్ష, ఉత్తర, మూల, పూర్వాభాద్ర ,, అతివృష్టము

ఆర్ద్ర, హస్త, పూర్వాషాఢ, ఉత్తరభాద్ర ,, ఉగ్రామాఘము

పునర్వసు, చిత్త, ఉత్తరాషాఢ, రేవతి ,, [illegible]

## వెలల హెచ్చుతగ్గులు

చాంద్రమానము ననుసరించి

చైత్ర, అధికాషాఢ, నిజాషాఢ, శ్రావణ, భాద్రపద, కార్తిక, మార్గశీర్ష, పుష్యమాసములయందు వెలలు సమముగ నుండును.

వైశాఖ, మాఘ మాసములయందు వెలలు తక్కువగ నుండును.

జ్యేష్ఠ, ఫాల్గున మాసములయందు వెలలు హెచ్చుగా నుండును.

సౌరమానము ననుసరించి

మేష, మిథున, మకర, మీనమాసములయందు వెలలు సమముగ నుండును.

వృషభకర్కాటకమాసములయందు వెలలు తక్కువగ నుండును.

సింహ, కన్యా, తులా, వృశ్చిక, ధనుః, కుంభ మాసములయందు వెలలు హెచ్చుగ నుండును.

## వర్షయోగములు-తద్భంగములు

### చైత్రమాసము

ఈ మాసమున గ్రహములు దుష్టనాడులయందును, సునాడులయందును, ఉండుటచే స్వల్పవృష్టియు, ఉష్ణాధిక్యమును గలుగును.

### వైశాఖమాసము

ఈ మాసమున గ్రహసంచారాదులవల్ల కొలదిగా వర్షమును స్వల్పవర్షము పడమరగాలి యెక్కువగా కలుగుటయు కలుగును.

## జ్యేష్ఠమాసము

ఈ మాసమునందు గ్రహములలో ఎక్కువమంది వాత, అతివాత దహనాది దుష్టనాడులయందు సంచరించుటచేత పశ్చిమ వాయువును, ఉష్ణాధిక్యమును విశేషముగా గలిగి బుధశుక్రసమాగమాది సుయోగములవలన ఖండవృష్టి గలుగును.

## ఆషాఢమాసములు

జ్యేష్ఠ బహుళాష్టమి మొదలు అధికాషాఢ శు సప్తమివఱకు సూర్యుని మృగశిరానక్షత్రసంచారకాలమునందు రవ్యాదిగ్రహములన్నియు దుష్టనాడీసంచారముచేత పశ్చిమవాయువును, ఉష్ణాధిక్యమును గలుగును.

అధికాషాఢ శు ౮ లు మొదలు బ షష్ఠివఱకు సూర్యుని యొక్క ఆర్ద్రానక్షత్ర సంచారకాలమునందు సూర్యుడు పూర్ణ జలరాశియందు స్త్రీ నక్షత్రమునందు ప్రవేశించుటచేతను బుధశుక్రుల మధ్య రవి నడచుటచేతను గ్రహములు దుష్టనాడులయందు సంచరించినప్పటికిని అప్పటప్పట సామాన్యముగా వర్షించును. అధికాషాఢ బ ౭ షష్ఠి మొదలు నిజాషాఢ శుక్లపంచమివఱకు పునర్వసు నక్షత్ర రవి సంచారకాలమునందు గుర్వస్తమయము, గురు బుధ చంద్ర సమాగము మొదలుగాగల సుయోగములు గలుగుటచే సింహాంగారకాది, పురోంగారకాది స్వల్పదోషము లున్నప్పటికిని విశేషముగా వర్షము కురిసి నదులు బాగుగా ప్రవహించును.

నిజాషాఢశుక్లపంచమి మొదలు బహుళపంచమివఱకును సూర్యునియొక్క పుష్యమీనక్షత్రసంచారకాలమునందు గ్రహములన్నియు సునాడులయందుండుటచే సామాన్యముగా వర్షించును.

నిజాషాఢ శు ౧౪ లు మొదలు బ ౨ లు వఱకు గురు శుక్రులు ఏకరాశిగతు లగుటచే బాగుగా వర్షించును. నిజాషాఢబహుళ పంచమి మొదలు శ్రావణశుద్ధనవమివఱకు ఆశ్లేషానక్షత్రమునందు సూర్యునియొక్క సంచారకాలమునందు ఖండవృష్టిగా మంచి [illegible] లు గురియును.

## శ్రావణమాసము

శ్రావణశుద్ధ నవమి మొదలు బహుళవిదియ పర్యంతము సూర్యుని యొక్క మఘానక్షత్ర సంచారకాలమునందు సూర్యుడు స్త్రీ నక్షత్రయుక్తుడై నిర్జలరాశియందు ప్రవేశించుటచేతను, పురోంగారకాదిత్రావయోగములవల్లనున్ను వర్షాభావము కాదగి యున్నప్పటికిని చిత్రానక్షత్రమునందు కుజసంచారమును, గ్రహములకు జలనాడీసంచారాదిసుయోగములవల్లను సస్యానుకూలముగ వర్షించును.

శ్రావణ బహుళవిదియ మొదలు భాద్రపద శు ౧ లు వఱకు సూర్యునియొక్క పుబ్బానక్షత్ర సంచారకాలమునందు స్త్రీ పుంనక్షత్రయుక్తుడై నిర్జలరాశియందు ప్రవేశించుటచేతను అంగారకచలనమువల్లను రవి బుధ గురువులుమాత్రము జలనాడులయం దుండుటచేతను జలసంప్రకాలమున బాగుగా వర్షించును. వాయువుతోం గూడి వర్షించును.

## భాద్రపదమాసము

భాద్రపద శు ౧ మొదలు బ ౧ పర్యంతము సూర్యునియొక్క ఉత్తరానక్షత్ర సంచారకాలమునందు బుధ శుక్ర సమాగమాది సుయోగములవల్ల సస్యానుకూలముగ వర్షించును.

భాద్రపద బ ౧ లు లగాయతు ఈ బ ౧౪ వఱకు సూర్యుని యొక్క హస్తానక్షత్ర సంచారకాలమునందు విశాఖయందు కుజుడుండుటచేతను రవి బుధ గురువులు జలనాడులయందుండుటచేతను, ఇతర గ్రహములు దుష్టనాడులయందు ఉన్నప్పటికిని రవి స్త్రీ పుంనక్షత్రయుక్తుడై పూర్ణ జలరాశియందు ప్రవేశించుటచేత కొంచెము వాయువుతోం గూడి సంపూర్ణమైనవృష్టి గలుగును.

## ఆశ్వయుజమాసము

భాద్రపద బహుళ ౧౪ మొదలు ఆశ్వయుజ శుద్ధ ౧౩ పర్యంతము సూర్యునియొక్క చిత్రా నక్షత్ర సంచారకాలమునందు చతుర్గ్రహకూటము గలుగుటచేతనున్ను గ్రహములన్నియు దుష్టనాడులయందుండుటచేతనున్ను మధ్యవృష్టి కలుగును.

ఆశ్వయుజ శు ౧౩ మొదలు ఈ బ ౧౧ పర్యంతము సూర్యుని యొక్క స్వాతీనక్షత్రసంచారకాలమునందు వాయుసహితమైన వర్షము సస్యానుకూలముగా కురియును.

## కార్తికమాసము

ఆశ్వయుజ బ ౧౧ మొదలు కార్తిక శు ౧౧ వఱకు సూర్యుని యొక్క విశాఖానక్షత్ర సంచారకాలమునందు సామాన్యవృష్టి గలుగును. అనూరాధామూలాంతమువఱకు సూర్యుడు సంచరించు కాలమునందు మధ్యదేశమునందు స్వల్పవృష్టి కలుగుగును.

## దేశారిష్టయోగములు

ఈ సంవత్సరమున గురుడు మూడు రాసులయందు సంచరించుటచేతను, కుజగురువులకు శనిగురువులకు షష్ఠాష్టక సమసప్తకాది దోషములు గలుగుటచేతను లోకమునకు అరిష్టము కలుగును.

## పంచాంగశ్రవణఫలము

యశ్శృణోతి మధుశుక్లపక్షకే వర్షనాథసచివాధికంఫలమ్; ప్రాప్నుయాద్దురితముక్తవిగ్రహః ఆయురర్థమతులం యశస్సుఖమ్. కన్యావనీ కాంచనదిగ్గజానాం గవాం సహస్రం సతతం ద్విజేభ్యః; దత్వా ఫలం యల్లభతే మనుష్యస్తత్తత్ఫలాన్యబ్దఫలాని శృణ్వన్.

రాజా మంత్రీ సస్యనాథో రసానా

మీశస్సార్థం స్వామినో నీరసానామ్;

అర్ఘాధీశః కించ మేఘాధినాథో

ఽద్యశ్శ్రేయః శ్రోతౄణాం తత్ఫలాని.

దీసికొని యా మెను గూడినవానిని సంగభవ విద్యాపారగునిగాను, నా మెను దిరస్కరించినవానిని అరసికునిగాను జిత్రించినాఁడు.

రాయలకాలములో నాతని ముఖ్యపట్టణమగు విజయనగరము లోని వేశ్యావాటికం గూర్చి శ్రీకుందూరు ఈశ్వర దత్తుగారు వ్రాసిన "జీర్ణ విజయనగరచరిత్రము" న నిట్లు లిఖింపఁబడినది. "వేశ్యావాటికను గూర్చి యొకమాట మాత్రము చెప్పకతప్పదు. టంకసాల వెనుక నించు మించుగా నిరువది గజముల వెడల్పును, మూడుపందల గజముల పొడ వునుగల యొకవీథి గలదు. ఆవీథి కిరుప్రక్కలను చక్కని ప్రాపా రిండ్లతో నిండిన ముంగిటి వాకిళ్లుగల శోభనగృహములు బారులు తీర్చియున్నవి. ఆ ప్రాంగణములందు జంద్రకాంతశిలానిర్మితములైన వేదికలు వరుసగా గలవు. ఆ వేదికలకు వెనుక మేడ గోడలపై సింహ ములు, పులులు, చిరుత పులులు, ఏనుఁగులు మొదలగు వన్యమృగములు అనేకములు జీవములతో నున్నట్లుగా చిత్రింపబడినవి. అపరాహ్ణమున ఎండ వేడిమి యించుక తగ్గుచుండ నావారవిలాసినులు చక్కగా నలంకరింపఁ బడిన తమ యిండ్ల ప్రాంగణములందున్న చంద్రకాంత శిలా వేదికలపై తివాసుల మీదను, కుర్చీల మీదను, సోఫాల మీదను, ......చేౘజనముతో సుఖోపవిష్టులై యుందురు. ప్రతి వారవిలాసి నియు, నొడలంతయు, నవరత్నఖచితామూల్యాభరణములతో, మంచి ముత్తెముల హారములతో గన్నులకు మిఱుమిట్లు గొల్పు చక్కదన ముతో, రంగుచీరల గట్టుకొని మూచునారల హృదయములను జూఱ గొనుచుందురు. ఒక్కొక్క పడపుటింటికి ఇద్దఱు ముగ్గురు దాసీలు. వారు తమ యజమానులకడ నిలువబడి మార్గమునబోవు విటకాండ్రను ......బ్రయత్నించు చుందురు.—...వెలయాండ్ర పొత్తును గూడి సుఖింప గోరువాడు ఈ వీథినిబోయి తన యిచ్చవచ్చిన తరుణిని బడయవచ్చును"—ఈ వాక్యములను అబ్దుల్ రజా కనుచరిత్రకారుని గ్రంథమునుండి ఈశ్వరదత్తుగారు ఆంధ్రీకరించిరి.

పైవేశ్యావాటిక వంటి వాటికలు పెక్కులు విజయనగరమున నుండెడి వఁట. పెక్కుల, ఆవాటికలయం దుండెడి వేశ్యల సంఖ్య పండ్రెండువేలని చరిత్రములవలనఁ దెలియవచ్చు చున్నది.

వీరాగ్రేసరుఁడై శత్రునాశన మొనరించి నిరంకుశప్రతిభతో పృథ్వి నేలిన రాయలమి శృంగారప్రియుఁడును, భోగపరాయణుఁడును గూడ నగుటచే నాతని కాలములో భోగకామిను లుచ్చస్థితినంది యుం డుట వింతగాదు. ఈతనికాలములో వేశ్యాప్రియత్వము గౌరవా వహముగా నుండెడిదని యితనిచే రచియింపఁబడిన యాముక్తమాల్యద వలనఁగూడ బోధపడఁగలదు. ఇఁకఁ బెద్దనార్యుఁడన్ననో యీతఁడును భోగపరాయణుఁడగు శృంగారకవియే. ఈతఁడు శృంగారప్రియుఁ డగు రాజసంపూజ్య కవి యని యీతఁడొనరించిన "నిరుపహతిస్థలంబు" అను పద్యమే చెప్పుచున్నది. ఇట్టి పరిస్థితులతోఁ గూడియున్న శృం గారకవియు బహిరంగముగా వేశ్యాప్రియత్వముఁ జూపిన శ్రీనాథుని యనుయాయియు నగు పెద్దనార్యుఁడు వేశ్యను దృణీకరింప రాదనియు నట్లుచేసినవాఁడు రసహీనుఁడు, క్రూరుఁడు, నధముఁడు ననియు వ్రాయుట వింతకానేరదు. ఇట్టి శృంగారప్రియత్వము హెచ్చిన నీతి కొంత సడలుటను సంగతియుఁ గ్రొత్తదిగాదు.

మన పండితులవారు తమ పునర్విమర్శనములో "ఒక్కొక పద్యము వలన వ్యక్తుల యభిప్రాయములను నిర్ణయించుట సరికాదు. కావ్య మంతయు పరిశీలించినగాని గర్తయభిప్రాయము లెటు లున్నవో గ్రహింపవలను." అని లిఖించిరి.

పైపద్యమునందు నీతి సడలియున్నదని వ్రాసినవారలు కావ్యము నంతను బరిశీలించియే యాభావమును దెల్పిరి. కావ్యమునందలి యితర భాగములు తరుణి, యనన్య కాంతయను పద్యమునందలి భావమును ఖండించి వేయుటలేదు. ఆపద్యము అనన్యకాంతయగు వేశ్యను గూడుట తప్పుకాదనియు, వేశ్యవలపును దీర్చకుండుట రసికత్వము గాదనియు సిద్ధాంతీకరించు చున్నది. ఆంధ్రదేశవిద్యాసాగరులవారు కావ్యము నందు నీతిబోధకములగు పద్యములు వేలున్నను దుర్నీతిని బోధించు పద్య మొక్కటి యందుండుచో నాకావ్యమంతయు దుష్టకావ్యమై పోవుననియు మంచి పద్యములు కలిగించు లాభముకంటెఁ జెడ్డపద్యము కలిగించు నష్టమే హెచ్చుగుననియు నొక్కి వ్రాసియున్నారు. అది గాక పెద్దనార్యుఁడీ పద్యముద్వారముగా మాత్రమే నీతికి భంగకర మగు విషయమును బోధించి యుండలేదు. గ్రంథమునం దంతటను బచ్చి శృంగారమును విశేషముగా వర్ణించి యున్నాఁడు.

(1) కర్మఠుఁడు విరాగియు నగు ప్రవరునికి బిళ్లల మొలత్రాడు మున్నగు నగలను, అరుణాంశుకోత్తరీయాదుల నలెవాటును, రాకట్టు లను, బెద్దజుట్టుముళ్లను బెట్టి వరూథినికడకుఁ దీసికొని పోయినాఁడు.

(2) హిమగిరిపై జితేంద్రియునకు సప్తభార్యలనిమిత్తమై వీతి హోత్రుఁడువిరహతాపము పాలైనచోటు మున్నగువానినిజూపినాఁడు.

(3) తన్నువలచి పైఁబడిన దివ్యసుందరమూర్తియగు వరూథినిని గూడ లక్ష్యము చేయక ధర్మమునందు స్థిరబుద్ధిగలవాఁడై యా మెను ద్రోసి పుచ్చి తనవైరాగ్యమును వెల్లడించిన ధీరుఁడగు ప్రవరుని బేలయని, గోల యని, యరసికుఁడని, క్రూరుఁడని, యధముఁడని నిందించినాఁడు.

(4) తనయందు వలపులేని వరూథినిని మోసముచేసి కూడిన కలియను గంధర్వాధముని సంగభవవిద్యాపారగుఁ డని, వియచ్చర ప్రవరుఁ డని స్తుతించినాఁడు.

(5) తనవెచ్చెలుల బోధలు నివారితములు గాకుండఁ దానెట్లు భోగముల ననుభవింపఁ గలనని మనోరమ పెండ్లికిముందే పలికిన పలు కులను దీసికొనిపోయి భర్త పడకగదిలో సంభోగించుటకు సిద్ధపడు తఱియందుఁ బెట్టిన నాకోర్కెలు జరిగితీఱునని యానవోఢచే నప్పుడు వెట్టించినాఁడు.

(6) వేశ్యను గూడుట పరవనితను గూడుటయే యనియుఁ, బాపదాయక మనియు మూలము దెల్పుచుండఁగా నాభావము తీసి పాఱవేసినాఁడు.

(7) స్వరోచి భోగముల ననుభవించి యనుభవించి తుదకు విరాగియై తపస్సానరించి యుత్తమలోకమునకుఁ బోయినట్లు మూలము నందుఁ దెల్పఁబడి యుండఁగా నాభావమును దీసి పాఱవేసినాఁడు.

(8) వేటల రెండింటి నవసరముగాఁ బెట్టినాఁడు.

ఇట్టి వనేకము లుండుటచేఁ బెద్దనార్యుఁడు పచ్చి శృంగారమును హెచ్చుగా వర్ణించి తుదకు రసాభాసమును గూడఁ బుట్టించినాఁ డని యును దెలుపవలసి వచ్చినది. మన పంతులవా రస్మదాదులు వ్రాసిన విమర్శనము సరిగాఁ జూచుకొనలేదు. ఏసందర్భముననో వ్రాసిన విమర్శనములో నేకదేశమును మాత్రమును జూచి యదియే సంపూర్ణ విమర్శనముగా భావించి సత్యేతరఖండనములఁ గావించినారు. గ్రంథమునంతను జూచుకొనవలె ననియుఁ బ్రకరణసందర్భమును బరిశీలింప వలెననియుఁ బరులకు హితోపదేశము చేసిన మన పంతులవారు తమ యుపదేశమును దామే యతిక్రమించిరి.

“అస్తమించుచున్న సూర్యునకు జూపఱ పాత్రనిచ్చి భావము ప్రకటించిన మాత్రముననే కవినిజోద్దేశ మిది యని యన జెల్లునె” యని మఱియొక వాక్యమును బంతులవారు లిఖించిరి. కవి తనభావ ముల ననేకవిధములుగాఁ బ్రకటించును. ఒకప్పుడు తనభావమును బాత్రముల నోటఁ బలికించును. అప్పుడుకూడ నాభావము కవి దని యెంచు ప్రాజ్ఞులు తనభావమును దనమాటలతోఁ దెల్పినప్పు డయ్యది యాతనిభావ మని గ్రహించుట కేమి యభ్యంతర ముండును? తరుణీన న్యకాంత యను పద్యమందలి భావము పెద్దనార్యునిది గాక మఱె వ్వరి దగును? అది మూలమునందుఁ గూడ లేదే? కవి స్వయముగఁ దెచ్చిపెట్టినాఁడే! కాన నిప్పట్టున నది పెద్దనార్యునిభావ మనుటకు సందేహింప నవసరము లేదు.

## నాథునిచేఁ గోర్కెఁ దీర్పించుకొనుటకు సంభోగకాలమే మంచితఱి యనుట

(1) తన చెచ్చెలుల రోగబాధల నివారించినఁ గాని తాను బెండ్లి భోగముల ననుభవింపఁ జాలనని పెండ్లికిఁ బూర్వమునందే జనకుని కడను, కాఁబోవు నాథునికడను మనోరమ తెల్పుట గర్భాధానపు గదిలో నాథుఁడు కవియ నుంకించుసమయమునకుఁ బెద్దనచే మార్పఁ బడినది. ఈమార్పు కడు రసవంతమనియుఁ బెండ్లికూఁతురగు మనోరమ పెండ్లికొడుకగు స్వరోచితోఁ దన తండ్రియెదుర మాటలాడెననుట యొప్పదని తలఁచి గర్భాధానపుగదిలోఁ బెట్టినాఁ డనియు శ్రీ॥ శ్రీ॥ తేవప్పెరుమాళ్లయ్యగారు లిఖించిరి. తేవప్పెరుమాళ్లయ్యగారు చెప్పి నది సరికాదనియు మనోరమ తన చెలికత్తెలు వనటం గుందుచుండఁ దాను భోగముల ననుభవింపఁ జాలనని పెండ్లికొడుకుతోఁ బలుకలేద నియుఁ దన తండ్రితో ముచ్చటించెననియు నట్లు తండ్రితో సంభా షించుటకు సిగ్గువడ నవసరము లేదనియు గర్భాధానపు గదిలో నాథుఁడు పాన్పునఁ జేర్చి కౌఁగిలించుకొని ముద్దిడి మోహోద్రేకము నంది కవియఁ దమకించుచున్న సమయమున నదియే తన యభీష్టమును ప్రియునిచేఁ దీర్పించుకొనుటకుఁ దగుతఱి యని భావించి సంభోగము సరికట్టెననుట నవోఢయగు కులసతియు నగు మనోరమకుఁ దగదనియు నయ్యది వేశ్యాకృత్యము లనియు నేను నావిమర్శనములో వ్రాసితిని. ఇందులకుఁ దగు కారణముల విపులముగాఁ జూపితిని. కాని వానిని సరిగఁ జూచుకొనక యీక్రిందిరీతినిఁ బెద్దనార్యుని సమర్థింపఁ బంతులవారు యత్నించిరి. “మనోరమ కిదివఱకే తన చెలికత్తెలు క్షయ బాధలఁ దలఁ గృశించుచుండిరని విచారముగ నుండెను” అని పంతుల వారి వాదము. ఈవ్రాఁత కాధారము మనుచరిత్రములోఁ గానరాదు సరికదా పైఁగా నామె వివాహాదికాలములయందు మహోత్సాహమును జూపినట్లుగాఁ బెద్దన వ్రాసియుండె. అసంగతుల నన్నిటిని నే నిదివఱకే లిఖించి యున్నాను.

(2) “ఈ వివాహమునకుఁ బూర్వమే తన చెలికత్తెలఁ గూర్చి తండ్రికైన, భర్తకునైనఁ జెప్పుట కవకాశము చిక్కలేదు.” అని పంతులవారి వాదము. ఇది సరికాదు. ఆమె కాఁబోవు నాథుని యెదుట నుండఁగా వివాహమునకుఁ బూర్వమే తన చెచ్చెలు లిడుమలఁ గుడుచు చుండఁ దాను వివాహాదిభోగము లనుభవించుటకుఁ దనమనస్సున కంగీ కారముగా లేదని తండ్రితోఁ జెప్పినది. ఇది చరిత్రాంశము. మనోరమ చరిత్రమును దెలుపునది మార్కండేయపురాణము. అందామె తన మనోగతదుఃఖమును వివాహమునకు ముందే తెలిపినట్లు స్పష్టముగ నుడువఁ బడియున్నది. అట్టి సమయమునఁ దెలుపుట సహజమే యని నే ననేకోదాహరణము లిచ్చి ఋజువుచేసి యున్నాను. పెద్దన జరిగిన యథార్థాంశమునకు విరుద్ధముగఁ దాను గల్పించిపెట్టిన కల్పనమువలన నిక్కమగు చరిత్రాంశ మసత్యమై పోనేరదు. చరిత్రాత్మకవిమర్శనము చేయు పండితులు మన పంతులవారు వ్రాసినదాని నంగీకరింపఁజాలరు.

(3) “తన యభీష్టమును నెఱవేర్చినగాని తాను వివాహము చూడ నని తెల్పుటగాని తన వివాహమునకు చెచ్చెలుల రోగనివారణము ప్రతిఫలముగ నుంచుటగాని యాసమయమున నిందీవరాక్షునకు మనో రమపై నిరసనభావము కలిగియుండెడిది. కారణము కృతజ్ఞతకు మఱియొక ఫలమును గూడఁ గోరుట.” అని పంతులవారి వాదము. ఇది యు నసంగతమే. వివాహమువలె గర్భాధానమును దంపతుల కానంద దాయకమగు శుభకార్యము. మొదటి సమయముకంటె రెండవ సమ యము నాయిక కెక్కుడు సిగ్గును గలిగించును. తన యభీష్టమును నెఱవేర్చినఁగాని తాను వివాహమాడ నొల్లననిగాని, తన వివాహము నకు చెచ్చెలుల రోగనివారణము ప్రతిఫలముగ నుంచుటగాని, యాస మయమున నిందీవరాక్షునకు మనోరమపై నిరసనభావము కలిగియుం డెడిచోఁ దన యభీష్టమును నెఱవేర్చినఁగాని తాను గర్భాధానము నొల్లననికాని, తన గర్భాధానము చెచ్చెలుల రోగనివారణమునకుఁ

ప్రబలి ఫలముగ నుంచుటగాని, యాసమయమున నిందీవరాక్షునకు మనోరమపై నిరసనభావము మఱింత హెచ్చుచేయదా? ఏమన నలుగురిలోఁ దన మనోగతభావమును దెలుపుటకు సిగ్గుపడినను నిద్ద ఱును గదిలోనికిఁ జేరిన తరువాతనయిన నాథుఁడు తన్ను సమీపించినప్పుడు దెల్పవచ్చును. అప్పుడు దెల్పలేదు. ఆతఁడామెను బుజ్జగించి సెజ్జఁ జేర్చునప్పుడైనఁ జెప్పలేదు. ముద్దిడుకొనినప్పుడు గాని, కౌఁగిలించు కొనినప్పుడు గాని చెప్పలేదు. ఆతఁడు శృంగారచేష్ట లొనరించి యొనరించి పూర్ణమగు మోహావేశ మొంది కవియఁ దమకింప నత్తఱిఁ దనకోర్కినిం దెల్పుటకుఁ దగినయదననియెంచి యేడ్వమొదలిడెను. ఇదియేమి సంతోషసమయమున నేడ్చుచున్నావని నాథుఁడు వింతపడి యడిగెను. అప్పుఁడామె మెల్లగ,

ఉ. అక్కట నాయెడ న్మిగుల నక్కఱ గల్గి చరించు నెచ్చెలుల్
చిక్కి మునీంద్రశాపహతిఁ జెందిన దుర్దమరోగబాధలం
జొక్కుచునున్నవారు వనభూములఁ దద్దశ మాన్పవేని నా
కెక్కడిసౌఖ్య"

మని నుడివె. మనోరమదైన యీ స్వరోచికి నిరసనభావము పుట్టింపదా? ఇట్టి యనుచితచర్యయే నిరసనభావము పుట్టింప నప్పుడు మొదటిదెట్లు పుట్టించును? మనోరమ సంభోగసమయమునఁ గొన కాలమునందుఁ దన సంభోగేచ్ఛకు నాతంకము గలిగించినను స్వరోచి మఱియొకలాగున నెంచికొనక తన యభిలాషమునంతను నడచుకొని యారాత్రియే భార్యతోఁగూడ దివియలఁ జేతంబూని యరణ్యములలోనికిఁబోయి సఖులంగని పిమ్మట నోషధుల వెదకి తెచ్చి మాత్రలు కట్టి యిచ్చి రోగనివారణ మొనరించెనటు. ఇది యసంగతము, నసంభవ మునై యున్నదని పంతులవారు తెలిసికొనవలయును.

(4) "తన రాక్షసాకారము బోఁగొట్టిన స్వరోచి నభినందించుచు వాని శుభకార్యము నామోదించి సందనపూర్వకముగఁ గానుక లర్పించుచోఁ దన కన్యయేయిచ్చి కొండొక యభీష్టము వెలిపుచ్చుట యౌచిత్యమును బాటింపదు" అని పంతులవారి వాదము. ఇదియును సందర్భరహితమే. ఇందీవరాక్షుఁడు మనోరమను స్వరోచి కిచ్చి వివాహము చేయుదునని చెప్పినదానికి మనోరమ యాతంకమును గలిగింపలేదు. అందులకుఁ దనకుఁగల పరిపూర్ణాంగీకారము వినయభక్తులు మీఱఁ దెల్పినది. మనస్సు దుఃఖితమై యున్నది గావున నెచ్చెలుల బాధలు తొలంగువఱకు భోగేచ్ఛ కలుగుటలేదని తెలిపినది. మనోరమకుఁ దనతండ్రియుఁ గాఁబోవునాథుఁడును నాయుర్వేదపారంగతులని తెలియును. కావున దుఃఖనివారణోపాయమును వా రాలోచించుటకై తన మనోగతదుఃఖమును వెల్లడించినది. అది యౌచిత్యభంగము గలిగింపదు. అట్లు కలుగలేదు. అదియే యౌచిత్యభంగమును గలిగించునో గర్భాధానపుగదిలో నాథుఁడు మహోత్సాహముతో సంభోగింప నుద్రేకించియున్న సమయమున నాయుత్సాహమునకు భంగము గలిగించి యారాత్రియే యచ్చటనో అడవియందున్న చెలికత్తియల బాధలు తొలఁగింపుమనుఱకు సంభోగము నొల్లఁజాలననుట యెక్కుడగు ననౌచిత్యమును గలిగింపదా? తండ్రి తలపెట్టిన వివాహమునకు, వివాహవిషయములోఁ దండ్రిచేసిన యేర్పాటునకు మాఱుపల్కరాదని తన మనోగతదుఃఖము నణఁచుకొనిన మనోరమ గర్భాధాన విషయములో నాథుఁడు చేసిన యేర్పాటునకు మాఱుపలుకరాదని యెంచి భర్తయభీష్టమును దీర్చినపిమ్మట తన మనోగతాభిప్రాయములను వెలిఁబుచ్చుట సహజమగును గదా! మనోరమ యట్లుచేయలేదు గావున నది యసహజము, ననుచితము, నసహ్యాకరము నగుచున్నది.

(5) "ఆమెకు సౌఖ్యము హెచ్చుగ నున్న సమయములన్నిఁటను దన చెలులబాధలు జ్ఞప్తికివచ్చుచుండెను." అని పంతులగారి వాదము. ఇది నిర్మూలము. ఆమెకు వివాహాదిమహోత్సాహసమయములం దెప్పుడును నెచ్చెలుల బాధలు జ్ఞప్తికివచ్చినట్లు పెద్దన మనుచరిత్రమువలనఁ గాన్పింపదు సరికదా, మహోత్సాహముతో నామె యాసమయమునందు సంచరించినట్లుగూడ నాగ్రంథమువలన బోధపడుచున్నది.

(6) "రంగము మొత్తమును విచారించి, సందర్భముల నిరీక్షించి మనోరమ యుద్దేశ్యమును గ్రహింపవలె గాని 'సమర్థుండగు నతనిచే నది తీర్పించుకొనఁగలదియై' యను వాక్యములందు వేశ్యాపరముగ నర్థము జేయవచ్చునే?" అని పంతులుగారి వాదము. రంగము మొత్తమును విచారించుటచేతనే మనోరమయుద్దేశము వేశ్యలజిత్తుల నవలంబించుట యని సత్యరతి యున్నవారికి బోధపడఁగలదు. వివాహసమయమున భర్తమాపుల కెదురెక్కు మోహంపుఁజూపును జూచి మహోత్సాహముతోఁ దలఁబ్రాలుపోసి వివాహకృత్యముల నెల్ల నానందముతోఁ గొనసాగించి గర్భాధానపుఁగృత్యములలోఁ జుంబనాలింగనాదిశృంగారచేష్టలకు వేనికిని నాతంకము గలుగనీయక యొక్క సంభోగసమయమునందుమాత్రము తనకోర్కి ముందుగాఁ దీర్పించుకొనుటకై జాలినిబుట్టించు నాతంకములఁ గల్పించుట వెలయాండ్రజిత్తుమారితనముగాక మఱియేమగును? ఈ సందర్భముల వేనిని సరిగఁ జూచుకొనక పంతులవారు వ్రాసిన వ్రాఁత నిస్సారమును సత్యదూరము నగుచున్నది. మఱియు "గర్భాధానపుగదిలో గ్రహింపవలసిన ముఖ్యవిషయము నెచ్చెలుల రోగము నివారించుటయకాని సంభోగము నరిగట్టుటగాదు." అని పంతులవారు వ్రాసిరి. ఇది యాపాతరమణీయము. గర్భాధానపుగదిలో సంభోగము నరికట్టుట ముఖ్యవిషయమని యెవరును దలఁపలేదు. అది ముఖ్యవిషయమైన హానియేలేదు. అందు ముఖ్యమైనది గర్భాధానమని ప్రాజ్ఞులగువారికి వేఱుగఁ జెప్పనక్కఱలేదు. దానికి నెచ్చెలులబాధలు నివారించుకొనవలెనను మనోరమోద్దేశ మాతంకము గలిగించినది. అది వేశ్యాకృత్యమువంటి కృత్యమని పంతులవారు గ్రహింపకొనవలెను.

## మనుచరిత్రమునందలి కథానాయిక యెవరు?

మనుచరిత్రమునందలి కథానాయిక వరూధిని యని నేను దెల్పినట్లు పంతులవారు లిఖించిరి. అట్లు నేనొక్కఁడనే తెల్పియుండ

లేదు. పలువురు విమర్శకు లట్లు వ్రాసియుండిరి. ఆయూహనే నేనును జెప్పితిని. దానికేమి? ఇంక నస్మదాదులయూహనుగూర్చి పంతులవారేమి వ్రాసిరో కనుఁగొందము. పాపము! పంతులవారు కావ్యకథానాయికగా వేశ్య యుండఁగూడదని యంగీకరించిరి. కాని మనుచరిత్రమందలి కథానాయిక వేశ్యగాదనిరి. అందు కథానాయిక యొవ రనినఁ దుదకుఁ గథానాయికయే లేదనిరి. ఇది పెద్దవింత. మనుచరిత్రము సంభోగశృంగారరసప్రధాన మగు మహాప్రబంధము. అందు నాయిక లేదనుట కథ లేదనుటయే యగును. అందలి నాయిక పలువురు పండితులు దలంచుచున్నట్లుగాఁ బెద్దనచే వరూథినిగాఁ దీసికొనఁబడినది. కావుననే శృంగారరసవిజృంభణమును నామెకథలోఁ గవి పెట్టియుండెను. ఆమె వృత్తాంతము మొదటి మూఁడాశ్వాసములలో మాత్రమే కలదనియుఁ దరువాత లేదనియుఁ గాన నామె కథానాయిక గాఁజాలదనియుఁ బంతులవారు లిఖించిరి. ఇది గ్రంథము సరిగ చూచుకొనక వ్రాసిన వ్రాఁత. వరూథిని స్వరోచిని గనినవృత్తాంతము నాల్గవ యాశ్వాసమునందే కనఁబడుచున్నది. అందుండి చదువరుల యుపయోగార్థమై యొక పద్యము నుదాహరించెదను.

"శా. తేజం బబ్జభవాండగేహమునకున్ దీపాంకురచ్ఛాయమై
రాజిల్లన్ గ్రహతారకంబు రవిఁ జేరంబోని లగ్నంబునన్
రాజీవాక్షి సుమారుఁగాంచె సుమనోరాజన్యమాన్యున్ జనుల్
జేజేవెట్ట ప్రసూనవర్ష మమరశ్రేణుల్ ప్రవర్షింపఁగన్."

ఇందలి రాజీవాక్షి వరూథినియే. ఇది నాల్గవయాశ్వాసములో నాల్గవ పద్యము.

"ఒక కావ్యమునందు కథానాయికపాత్ర యాదినుండి యంతమువఱకు పోషింపఁబడవలెను." అని పంతులవారు వ్రాసిరి. ఇది సరికాదు. కథానాయిక మొదటనుండి తుదివఱకును చిత్రింపఁబడ నవసరము లేదు. కాళిదాసాదిమహాకవికృతకుమారసంభవాదిప్రబంధరాజములలో నాయిక తుదివఱకును జిత్రింపఁబడి యుండలేదు. షేక్స్పియర్ మహాకవి వ్రాసిన కింగులీయర్ అను నాటకమునందు నాయిక యగు కార్డీలియా యన్ని యంకములందును గలదా? ఇట్టివనేకములు గలవు. "కావ్యమునందు రెండుకథ లుండుటవలన నొకే నాయకుఁ డుండుటకు వీలు లేదు" అని పంతులవారు వ్రాసిరి. రెండు కథ లుండిన నిద్దఱునాయిక లుండుట కభ్యంతరము లేదుగదా? కావున మొదటికథకు వరూథినిని గథానాయికగాఁ జెప్పితీఱవలయును. "ఉత్తరకథ పూర్వకథయొక్క ఫలితము కానేర" దని పంతులుగారు వ్రాసిరి. ఇదియును సత్యము గాదు. ఉత్తరకథ పూర్వకథయొక్క ఫలితమే. పూర్వకథలోని నాయికయగు వరూథినియొక్క పుత్రుఁడగు స్వరోచికథయు, మనుమఁడగు స్వారోచిషుని కథయుఁ దెలుపఁబడినవి. పూర్వకథ లేకున్న నుత్తరకథ లేనేలేదు. కావున నిదివఱకుఁ బండితులు దలఁచుచున్నరీతిగా వరూథిని యను వేశ్య మనుచరిత్రమందుఁ గథానాయికగా నున్నదని చెప్పక తప్పదు.

## పెద్దన నీతిపరత్వము

ఇఁక నొక యంశమునుగూర్చి కొంత ముచ్చటించి యీ ప్రతివిమర్శనము నింతటితోఁ గట్టిపెట్టుచున్నాను. పంతులవారు తమ వ్యాసమునకుఁ బెద్దన నీతిపరుఁడను శీర్షిక నుబెట్ట యందుదాహరించిన నీతుల యందాదరము కలవాఁడేయని ఋజువుచేయ నేమేమో వ్రాసిరి. అది యంతయు వృథాశ్రమ. ఏమనఁ బెద్దనార్యుఁడు నీతులయందు నాదరము లేనివాఁడని యెవ్వరును వ్రాసియుండలేదు. అస్మదాదులము పెద్దనార్యుఁడు బహునీతులనుగూర్చి చక్కఁగా వ్రాసినాఁడని తెలుపుటయేకాక యందుకుఁదగు నుదాహరణములను విపులముగా నిచ్చియున్నాము. పంతులవారు తుద కాతఁడు వ్యక్తపఱచిన నీతులేవో చూపలేకపోయిరి. నేను వ్రాసియున్న వ్యాసములను జూచినఁ బెద్దన బహునీతులంగూర్చి జూపిన యాదరభావము బాగుగ స్పష్టము కాఁగలదు.

పెద్దనార్యుని పచ్చి-శృంగారప్రియత్వము గ్రంథముయొక్క యుత్తమత్వమునకు హానిని గలిగించినదని యస్మదాదులము వ్రాసితిమి. ఈతఁడు గ్రంథమునఁ జూపినది నిస్సంశయము మెచ్చుకొనఁదగని పచ్చి-శృంగారమని యాంగ్లేయవిద్యాధికులై విద్యావినోద బిరుదాంకితులై చెన్నపురియున్నతన్యాయస్థానన్యాయవాదులై విఖ్యాతకీర్తిశేషులైన పనప్పాకం అనంతాచార్యులవారును నిట్లు వ్రాసిరి:

" He has treated us to the common-places of human affairs and to the physical effects of the sort of love which coarser minds gloat over and which we want no poet describe to the world."

కాన నస్మత్పక్షము సురక్షితమే. పూర్వమహాకవుల మహాకావ్యములందలి గుణదోషనిరూపణమును విద్యార్థుల కుపయోగార్థమై యస్మదాదులము చేయుచున్నామేకాని యా మహాకవుల నిందించుటకుఁ గాదని పంతులవారింటివారు తెలిసికొని తమ లేఖినిని మనిక దిద్దుకొందురుగాక.

పంతులవారు నావ్యాసముల సరిగఁజూచుకొనక యొచ్చటనో యొక్కచోటనున్న యొకయంశమునుమాత్ర మొకింత మాచుకొని భ్రమకులోనై యొక యాకాశహర్మ్యమును నిర్మించిరి. ఇఁకముందైనఁ దాము విమర్శింపఁదలఁచుకొనిన విషయమును బాగుగఁజదివి చూచుకొని యాంగ్లేయోన్నతవిద్యయందుఁ దమకుఁగల ప్రజ్ఞను జూపుచు చరిత్రాత్మకవిమర్శనముల సరసముగ వ్రాసి యాంధ్రలోకమునకు మహోపకారము చేయుదురుగాక!

ఉ. భాసురసూరదీప్తి పటఁ బస్మపసస్థపదార్థమందునన్
భాసితనీరపంకముల భక్తత యేర్పడు చుండునట్లుగా
వాసిగ సూరిరాడ్రుచితభవ్యవిమర్శనమూలకంబుగా
దోసములున్ గుణంబులును దోఁపవలెన్ గృతిలోని వాస్తుగన్,

# ప్రయోగవిశేషవివరణము-నిర్వచనోత్తర రామాయణము

విద్వాన్, దువ్వూరి వెంకటరమణ శాస్త్రిగారు

ఆంధ్రవాఙ్మయమునఁ బ్రాచీనకవుల ప్రయోగవిశేషములఁ దెలిసికొనఁగోరుట భాషాస్వరూపజిజ్ఞాసువులకు సహజంబు. ఆ విశేషములను సాకల్యముగ నిర్దేశించుట లాక్షణికుల కర్తవ్యమయ్యును నాంధ్రలాక్షణికులు వాని నెల్ల సమగ్రముగఁ బరిశీలింపకయుఁ, బరిశీలించినను దేశ్యప్రత్యేకముగ నిరూపింపఁ దలంచియు వ్యాకరణములు రచించినారగుటచే వీనివలన సిద్ధింపవలసిన ప్రయోజనము సాకల్యముగ సిద్ధింపనయ్యెను. ఇంతియగాక యివి సమగ్రములను భ్రాంతిచే వీనిలో నిరూపింపఁబడని వెల్ల నసాధునే యను నొకయభిప్రాయము దేశమునఁ గొంతవఱకు నాటుకొనియుండుటంబట్టి యీయసమగ్రవ్యాకరణములవలన భాషాస్వరూపనిర్ణయమునఁ గొంతయనర్థముగూడ సంభవించుచున్నది. మఱియు నాంధ్రలాక్షణికులలోఁ బెక్కండ్రు తమలక్షణములకుఁ బ్రమాణములగు కవిప్రయోగముల నిర్దేశింపకుండుటచేఁ గొన్నిలక్షణముల ప్రామాణ్యము గొంతవఱకు సంశయితమగుచుండుటయుం గలదు. ఈయనర్థములు గొంతవఱకుఁ దొలఁగుటకుఁ బ్రాచీనమహాకవుల ప్రయోగములఁ బరిశీలించి వెలువరించుట భాషాసేవకుల కర్తవ్యము.

ఇక్కడ నిర్వచనోత్తరరామాయణమందలి కొన్ని ప్రయోగవిశేషములు లాక్షణికులచే సంగ్రహింపఁబడినవి. మఱికొన్నిటిని సాధింపఁగల సూత్రము లున్నను వానికియ్యవి ప్రమాణములుగఁ జూపఁబడియుండలేదు. కొన్ని సర్వథా నుపేక్షింపఁబడినవి. కొన్నిటి విషయమున లాక్షణికులకు మతభేదము లేర్పడినవి. వానిలోఁ బ్రధానము లని నాకుఁ దోఁచిన ప్రయోగవిశేషముల నిట వివరింపఁబూనితిని.

(1)

"......[illegible] డైన
[illegible]...ఁ [illegible]..." (నిర్వ. 1-2.)

ఆంధ్రశబ్దచింతామణియందు "అస్మద్యుష్మదోర్ద్వ్యాద్యాదేకత్వ ఇతో నిమిత్తపరసాం [illegible]। బహుషు న మధ్యమవ దుత్తోచ్ఛ సర్వేషు" అను సూత్రములచే నస్మద్యుష్మదర్థవిశేషణములకు 'ని, వి, న, పు, ను, రు' అను నాగమములు నిత్యముగా విధింపఁబడినవి. వికృతివివేకమున 'ఇతో ఽస్మద్యుష్మదర్థా త్స్యాన్నా మ్నో నిర్వోశ్చ వా క్వచిత్' అని 'ని, వి' యను రెంటికిమాత్రము వైకల్పికత్వము విధింపఁబడెను. ఈ రెండు గ్రంథముల నాధారముగఁ గొని యహోబలపండితుఁ డితరాగమములు నిత్యము లని తలంచి 'పాంథ భూవరుసఖుఁ గోడ లైతి నిత్యాదివచనం త్వనాకరమేవ' యనియు, 'కోవిదులు గారు, ఇతి కవితాపితామహోక్తి ర్నిర్మూలైవ' యని యుఁ బ్రామాణికాగ్రగణ్యుల ప్రయోగముల నిందుమించుగా నిరసించియుండెను. ఆతఁడు పూనుకొన్నచో నే నకారమునకో యర్థము గల్పించి పయిప్రయోగముల సాధించుటకు మార్గ మిట లేకపోలేదు. ఆమార్గ మీతనికిఁ గ్రొత్తదియుఁ గాదు. ఎందుల కుపేక్షించెనో! కూచిమంచి తిమ్మకవి యిట్టిప్రయోగములఁ బరికించి తన సర్వలక్షణసారసంగ్రహమున,

"యుష్మదస్మత్పదంబులం దొనర ఘనుఁడ
నైన నీవును నధికుఁడ నైన నేను
ననెడుచో ఘనుఁ డైన నీ వధికుఁ డైన
నే ననంగ వునుల్ వాయు నీలకంఠ."

(సర్వ-1-ఆ-సంధి-152)

అని 'వు, ను'ల వైకల్పికతను నిరూపించి తిక్కనాది మహాకవుల ప్రయోగములఁ బెక్కిటి నుదాహరించియుండెను. కాని,

"యుష్మదర్థంబు బహువచనోక్తిఁ బలుకు
నపుడు ఘనులు ప్రసిద్ధులు ననుపదముల
కలర ఘనులరు కడుఁ బ్రసిద్ధులరుమీర
నంగఁ జనుఁ గావ్యములయం దనంగవమన."

(సర్వ-1 ఆ-సంధి-162)

అని యుష్మద్విషయకముగ వేఱొక లక్షణపద్యము వ్రాసి బహువచనాంతోదాహరణము లన్నిటిని నాగమసహితంబులనే చూపియుంటచే నీతఁడుగూడ నీయాగమములు యుష్మద్బహువచనమున నిత్యము లనియే తలంచినట్లు తోఁచెడిని. ఇదంతయుఁ బరిశీలించి యింకను లక్ష్యశోధనము గావించి చిన్నయసూరి "ప్రథమాంతంబులను యుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వునులును, బహుత్వంబున రులును నంతాగమంబులు ప్రాయికంబుగా నగు" (బాల-కారక-33) నని సకలప్రయోగసమ్మతంబుగఁ బ్రాయికత్వమును విధించి యన్నివచనములందును గొన్నియెడల నివి రాకుంటయుం గల

దని సూచించి కొన్ని యుదాహరణములఁ జూపియుండెను. కాని బహువచనోదాహరణముల నాగమరహితంబు లనువానిని దిమ్మకవి సంగ్రహింపకుండుటచే నట్టివాని నెల్లఁ జూపుట మిక్కిలి యావశ్యక మయ్యును యుష్మచ్ఛబ్దబహువచనమునకు మాత్రము 'మీరలు పెద్దలు' అనుదానిని జూపి యస్మచ్ఛబ్దబహువచనోదాహరణము నేల మూప కుండెనో! దానికి..."ఏమీ మువ్వురన్ మన్ననలఁ బడయంగాఁదగు నట్టివారము..."(భార-ఉద్యో-౨-౨౮౨)అను సోమయాజుల ప్రయోగమే కలదు. దీనింగూడ సూరి చూపియుండిన మఱింత సమంజసముగా నుండెడిది. ఈసందర్భమునఁ ద్రిలింగలక్షణశేషకర్త యయినను "తచ్ఛబ్దాంతములకు ధాతుజవిశేషణంబులమీఁద నరు వాఁపట్టదు" (ప్రౌఢవ్యా-కారక-౨౬) అని సూత్రించి 'మీ రేయేగిరులఁ జూచి నారు' అను మనుచరిత్ర ప్రయోగము నుదాహరించి యుష్మచ్ఛబ్ద వచనవిషయకమగు సూరిగారి ప్రాయికత్వమును వివరించెనేకాని పయిని జూపిన యస్మచ్ఛబ్దబహువచనోదాహృతిని సంగ్రహింపఁడయ్యె. మఱియు నీతని యీ క్రొత్తలక్షణమునకు విరుద్ధ మయినప్రయోగము భారతమునఁ గానవచ్చెడిని.

> క. "సురుఁడును నీవును మద్రే
> శ్వరుఁడును గర్ణుండుఁ గృపుఁడు సౌబలుఁడు ననన్
> నర యేలింపఁగ నున్నా
> రరు నీకుం దగునె సంగరములోఁ గలఁగన్."
>
> (భార-ద్రోణ-౫-౧౧౧.)

పయి పద్యమున 'ఉన్నారరు' అనునది తచ్ఛబ్దాంతధాతుజవిశేషణ మనకతీఅదు గదా! ఇట్టిప్రయోగముల నాధారముగఁ గొనియే తిమ్మకవి,

> "విన్నారరు కన్నారరు
> నున్నారరు నను దుఁ బలుక నొప్పుం గృతులన్।"
>
> (సర్వ-1-సంధి-142.)

అని విశదీకరించెను. పయిని జూపినరీతిని దిక్కనాదిమహాకవుల ప్రయోగము లీయాగమములు సార్వత్రికములు, నిత్యములు గా వని స్థాపించుచుండ నిట్టియెడ లాక్షణికుల కిన్ని మతభేదము లేందు లకో? ప్రాచీనతాళపత్రగ్రంథములందలి పాఠభేదములు వీరి నిట్లు భిన్నమార్గములఁ ద్రొక్కించియుండు నేమో! ఎట్లయినఁ గానిండు. ఈయాగమములు ప్రాయికము లగుటయే ప్రాచీనప్రయోగతత్త్వము.

(2)

> "మఘువిద్యాప్రియుఁడై దివౌకసుల సమ్మానించుఁ బ్రత్యర్థి బా
> హుఘనాటోపము మాన్చు దిగ్విజయలీలోత్సాహియై సజ్జనా
> లఘుకార్యంబులు దీర్చు వైదికవిధిశ్లాఘాదరస్వాంతుఁడై
> రఘుభూపాలుఁ జెప్ప నొప్పదె జగత్ప్రాణప్రవీణాత్మకున్."
>
> (నిర్వ-౧-౨౨.)

'యజ్ఞస్సవోఽధ్వరో యాగస్సప్తతన్తుర్మఖః క్రతుః' (నామలింగానుశాసనము) అను నీయజ్ఞపర్యాయములలోని మఖశబ్దము ఖకారఘటితముగ సంస్కృతమునఁ బ్రసిద్ధము. భానోజీదీక్షితీయము మున్నగు నామలింగానుశాసనవ్యాఖ్యలుగూడ దీనిని ఖకారఘటితము గనే సాధించుచున్నవి. ఇంద్రవాచక మగు 'మఘవాన్' అను దాని లోని మఘశబ్దము యజ్ఞార్థకము గాఁ దనియు సూచించుచున్నవి. ఆప్టేనిఘంటువునఁగూడ నియ్యది ఖకారయుక్తముగనే కానవచ్చును. ఘకారయుక్తముగఁ గానరాదు. శబ్దరత్నాకరమున మఖ, మఘ యను శబ్దములు రెండును చేర్కొనఁబడినవి. రెంటికిని యజ్ఞార్థకత్వము నిరూపింపఁబడినది. ఒకదానికిని బ్రయోగము చూపఁబడియుండలేదు. ప్రసిద్ధమగు మఖశబ్దమునకుఁ జూప నక్కఱ లేకున్నను విశేష రూపమగు మఘశబ్దమునకుఁ బ్రయోగము చూపుట యావశ్యకము. ఈశబ్దము ఘకారఘటితమై యజ్ఞార్థక మనుటకుఁ బయిపద్యములోఁ బ్రాసనిబద్ధమగు ప్రయోగ మాధారముగ గ్రహింపఁదగును.

(3)

ఇంద్రజిచ్ఛబ్దమునకు, 'ఇంద్రజిత్తు, ఇంద్రజిత్తుండు, ఇంద్రజి' అను తత్సమరూపముల నాంధ్రలాక్షణికులు సాధించియుండిరి. అందు 'ఇంద్రజి' అనునది యాధునికవ్యవహారదూరము. ప్రాచీనభాషలో నైన నీరూప మిట్లుండునా యని కొందఱు సంశయించుచుండ నటి వికారము దాని కేర్పడినది. అద్దాని క్రింది ప్రయోగము లరయఁ దగును.

| | |
|---|---|
| ౧ "ఇంద్రజి ననిలోఁ జంపి" | (నిర్వ-౧-౮౧) |
| ౨ "ఇంద్రజిచావు దెలంప" | (నిర్వ-౨-౧౩) |
| 3 "పిపిన నింద్రజి యనువేరఁ బెంపుఁ బడసె" | (నిర్వ-౪-౧౫.) |

(4)

> "అక్కల కన్యకాత్వ మిటు లాఁడిపోవ నకారణంబ నీ
> కెక్కడిచూలు వచ్చె నిది యెయ్యెడ నెమ్మెయిఁ బుట్టె..."
>
> (నిర్వ-౨-౨౪)

అక్కయను సంబోధనాంతమునకు 'అల' యనుశబ్ద మిటు సను ప్రయుక్తమయిననని త్రిలింగలక్షణశేషకర్త సంగ్రహించెను.(ప్రౌఢ-శబ్ద-౧౫)ఈయనుప్రయోగము తెలుగు గానరాకుంటచేనిది 'అక్కట' యనునది కవిప్రయుక్తమయి యుండునేమోయని కొందఱు తలంతురు.

(5)

> "సటితెంచి కదియఁబడి యే
> డైఱ ప్రేసిన మోము దాఁచి తిరిగి గదుసె..."
>
> (నిర్వ-3-౨౬.)

అట 'తాఁకి' యనఁగఁ దాఁకుటచే నని యర్థము. కావుననే 'ఇ' ప్రత్యయమునకు హేత్వర్థకత్వమును గల దని ప్రౌఢవ్యాకరణకర్త యీలక్ష్యముతోపాటుగ మఱికొన్ని ప్రామాణికలక్ష్యములఁ జూపియుండెను. (ప్రౌఢ-క్రి-౧౨౫) 'జ్వరము వచ్చి యతండు రాఁజాలఁడయ్యె' నిత్యాదివాక్యములలో నధునాతనవ్యవహారమునఁగూడ నీహేత్వర్థము రూఢమై యున్నది. సంస్కృతభాషయందును
"సురతాని చ తాని తే రహః స్మర! సంస్మృత్య న శాన్తిరస్తి మే'

(కుమారసంభవము-౪-౧౭)

"శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే"
"మా ముపేత్య తు కౌన్తేయ! పునర్జన్మ న విద్యతే"

మున్నగు కాళిదాసాదిమహాకవిప్రయోగములలో 'క్త్వా' ప్రత్యయమునకు హేత్వర్థము స్పష్టముగా భాసిల్లుచుండును. కొన్ని యెడలఁ జేదర్థమును స్ఫురించుచుండును. మఱియుఁ బైని జూపిన సంస్కృతవాక్యములలో 'క్త్వా' ప్రత్యయాంతస్థలముల నుండవలసిన సమానకర్తృకతానియమమునకు భంగము వాటిల్లినది. కాని యిట్టియెడ నేదో పదముల నధ్యాహరించుకొని నియమభంగము లే దని శాబ్దికులు సమర్థింతురు. ఇట్టి నియమములఁ గొన్నిటిని పాటింపక మహాకవులు నిరంకుశులై ప్రయోగించియుందు రని కొందఱు తలంతురు. అది య ట్లుండ నిండు. త్రిలింగలక్షణశేషకర్త క్రొత్తగ నిరూపించిన హేత్వర్థమే కాక 'ఇ' ప్రత్యయమునకు మఱికొన్నియర్థములు గలవు. "వాఁడు వచ్చి యొక్కవత్సర మైనది' మున్నగుచోట్ల 'వచ్చుట మొదలుకొని' యని కాని 'వచ్చినపిమ్మట' నని కాని యర్థము చెప్పవలసియుండును. ఈయర్థ మాధునికవ్యవహారముననేకాక ప్రాచీనకవిప్రయోగములందును నుపలబ్ధమగును. క్రిందివాక్యముఁ బరిశీలింపుఁడు.

"......ఇచటి కిమ్మునివరేణ్యుఁ
డేతేర దొరకొని యెన్నిగొన్నాళ్లయ్యె నీ వేమి దిద్దితి వెఱుఁగఁజెపుమ"

(కళాపూర్ణోదయము-౨-౩౦)

ఈవాక్యమున బాలవ్యాకరణమున విధింపఁబడిన సమానాశ్రయత్వముగాని, ప్రౌఢవ్యాకరణమున విధింపఁబడిన హేత్వర్థకత్వముగాని లేకుండుట స్పష్టము.—మఱియుఁ ఇట్టి కష్ట మనుభవించి యెఱుంగను' మున్నగు వాక్యములలో, 'ఇ' ప్రత్యయము భావార్థక (అనుభవించుట) మనఁదగును.

"...కడున్ విచిత్రము ద్వారకాపురి వాయ నీ
కిచ్చ పుట్టుట యెన్నఁడున్ మఱి యిట్టు లేఁగి యెఱుంగ వీ
వచ్చెలుల్ మణిగేహముల్ సిరులిట్లు యున్నవియే కదా."

(కళాపూర్ణోదయము-౩-౧౨౯)

ఇట 'ఏఁగి' యనుచో భావార్థము (ఏఁగుట) స్ఫురించి సమన్వయమున కనుకూలించెడిని. ఇట్టి వింకను ప్రాచీనాధునాతనవ్యవహారములందుఁ బరిశీలింపఁదగును.

(6)

"ఈలోకంబున నరసితి
మే లెల్లెడ వరునిఁ గాన మేనని కరుగం
జాలక యున్నను బోవను
బాలికఁ గొని పోవఁదలయుఁ బ[illegible]"

(నిర్వ-౩-౮౨.)

'ఈ (పాతాళ) లోకమున నెల్లెడ నరసితిని. మేలువరుని గానను' అని యిట నన్వయము. ప్రౌఢవ్యాకరణకర్త 'విశేషణంబులు గొన్ని వ్యవహితంబులు నగు' (శబ్ద-౧౧) నని సూత్రించి దీని నొక్కదానినే యుదాహరణముగఁ జూపియుండెను. ఆయుదాహరణమునఁ బాఠ మించుక మార్పుతో 'ఈలోకంబున వెదకితి మే లెల్లెడ గాన వరుని' అని యున్నది. తాను నిరూపించిన వ్యవహితత్వమునకు మఱింత యనువుపడునట్లు బహుపదవ్యవధానముగల యీపాఠ మీతని కేతాళపత్రగ్రంథమున లభించినదో ఇనిటి యీపాఠభేదమునుబట్టి వ్యవధానమే లేని వేఱొకపాఠ మేదేని తాళపత్రములలో లభించునేమో యనియుఁ గొంద ఱిట సంశయింతురు.

(7)

"...ప్రియం బంతంతకున్ జేర్చున
ట్లుగ నీయన్వయనామధేయములు విండుం జెప్పు మా కేర్పడన్"

(నిర్వ-౪-౭)

'తిదుటలు పరంబు లగునపు డన్యాదుల నుస్థానంబున నున్నయు నుండుదులోపంబును విభాష నగు' (క్రి-౫౮) 'ఇట బిందువుమీఁది తవలకు నిత్యవైకల్పికంబులై టడ లగు' (క్రి-౫౯) అను బాలవ్యాకరణసూత్రములచే వినుధాతువునకుఁ దద్ధర్మార్థకోత్తమపురుషైకవచనంబున 'విండును, విందును, వినుదును' అనురూపములు సిద్ధించును. వీనిలో 'విండును' అను డకారఘటితరూపమునకుఁ బ్రయోగము క్వాచిత్కము. పయిపద్యమున 'విండున్' అనుదాని డకారము విశ్రమమున సంఘటితమై యుండుటచే దీనిని బ్రమాణముగఁ గైకొనఁదగును. ఇట్టి డకారయుక్తరూపములు తిక్కనభాషలో మెండుగాఁ గానవచ్చును. క్రింది భారతప్రయోగము లరయుఁడు:—

౧ "ఎండకు వాన కోర్చి తనయిల్లు ప్రవాసపుఁజోటు నాక
కొండు నలంగుదున్..."

(భార-విరా-౧-౧౩౫)

౨ "గాండీవధన్వ నాహవ
పాండిత్యముఁ దలఁప కతని భండనమున మా
ర్కొండు నని యొకఁడు దలఁచుట.
..............................." (భార-ఉద్యో-౧-౨౩౭)

3 "పాండవులం బాంచాలుగ

..............................

......పేరుఁ బెంపుం

గంచు న్నే నొండు లేక కార్యము దలఁపన్"

(భార-సౌప్తిక-౧-౫౮)

౪ "...........మాచి

కొండ మెల్లపనులు రండు వేగ"

(భార-సభాపర్వ ౧౭౩)

(8)

"...రాక్షసవంశచరుండు నిచ్చోఁ గై

లాసమునోలెఁ బ్రాంశుఘనశృంగ బను నాల్గు నికేతరత్నమున్"

(నిర్వ-౪-౧౯)

గృహపర్యాయముగ 'నికేతన' శబ్దము ప్రసిద్ధమై యున్నది. తత్పర్యాయముగ 'నికేత' శబ్దమును సంస్కృతభాషలోఁ గలదు.

"శ్రితగోకర్ణనికేత మీశ్వరమ్"

(రఘువం-౮-33)

"ఆఖ్యాతవాల్మీకినికేతమార్గః"

(రఘువం-౧౪-౫౮)

"శిలాశయాం తా మనికేతవాసినీమ్"

(కుమారసం-౫-౨౫)

మున్నగు ప్రయోగము లరయఁదగును. ప్రకృతపద్యమునఁ దిక్కన 'నికేత' శబ్దమును బ్రయోగించియుండెను. ఈపదము శబ్దరత్నాకరమునఁ జేర్పఁబడవయ్యె. ఆంధ్రగ్రంథములలోఁ గానరాని సంస్కృతపదముల నెన్నిటినో పేర్కొని యాంధ్రకవులు ప్రయోగించిన యిట్టి సంస్కృతపదములను పేక్షించుట యాంధ్రనిఘంటువుల కుచితముగాదు.

(9)

"అది మొదలు గాఁగ విష్ణుని

మది నిల్పి యతండ నాకు మగఁ డగు నని యి

ట్లు దపంబు సేయుచుండుదు

.................................." (నిర్వ-౫-౮)

చింతామణిలో 'న వికృతిశబ్దా త్పరత స్సాంస్కృతికానాం భవన్తి గసడదవాః' అని తెలుఁగు శబ్దముమీఁది సాంస్కృతికపదములకు గసడదవాదేశము నిషిద్ధమైనది. ఇట నహోబలపండితుఁడు,

"పరుషా వా స్వరూపేణ ప్రథమాన్తోపరి స్థితాః

కాకా సంబోధనే చాఽపి హ్యవ్యయే కర్మధారయే

అచేతనార్థకే శబ్దే ఇతి శృఙ్గారభూషణః"

అను నథర్వణకారికలఁ జూపి 'సంస్కృతాసంస్కృతసాధారణ్యేన అర్థవిశేషే వికల్ప ఉక్తః నినుఁ గొనియాడ శక్య మవునె తాపసమందార, దాపసమందార' యని వ్యాఖ్య చేసియుండెను. దీనింబట్టి యీ యర్థవిశేషములందుఁ దెలుఁగుమీఁది సాంస్కృతికములకుఁగూడ వికల్పముగ నాదేశము రాఁదగు నని యాతఁడు పలంచినట్లు తోఁచెడిని. అథర్వణకారిక చింతామణిచే 'గసడదవాస్స్యుః ప్రథమా మాత్రాత్' అని నిత్యముగ విధింపఁబడిన యాదేశమును వికల్పించుచున్నదా లేక 'నవికృతిశబ్దాత్' అని నిషిద్ధమయిన యాదేశము నంగీకరించుచున్నదా యనువిషయము మూలపర్యాలోచనచే వేఱుగాఁ జర్చింపఁదగినది. కేతన యాంధ్రభాషాభూషణమున వికృతిశబ్దములమీఁది సాంస్కృతికముల కీయాదేశమును నిషేధించిన ట్లగపడదు. మఱియు నారఁడు విజ్ఞానేశ్వరీయమున,

'భూమల్లభు వేదవిదుని

దైవతమును దిట్టినతఁడు దండువు పేరన్

వేదములు నెనిమిదిటిని

వేవేగమె యరుపలయు విధిఁ దలమగన్'

(ప్రాయశ్చిత్తకాండ)

అని ప్రయోగించియుండుటచే నీసంధి యాతనికి సమ్మత మనుటకును వీలు గలదు. అప్పకవి

"పరమాత్మ ప్రథమావిభక్తులమీఁదను దత్సమానాంధ్రశబ్దములమీఁదఁ గల సంస్కృతపదాదిగతపరుషంబు లెల్లెడ నిజరూపముల్ చెడక నిలుచు......................................"

(అప్ప-౫-౧౭౩)

అని యీసంధిని నిషేధించియుండెను. తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమున 'న వికృతిశబ్దాత్' అను శబ్దశాసనసూత్రమునకు విరుద్ధములగు ప్రయోగములను నిర్వచనోత్తరరామాయణ (ప్రస్తుతప్రయోగమే) కాశీఖండవసుచరిత్రములలోనివానిని జూపి యీసంధి నంగీకరించెను. ఆంధ్రకౌముదిలో 'న వికృతిపదాదాద్యానామ్' అని దీనికి నిషేధము గలదు. చిన్నయసూరియు దీని నిషేధించెను. త్రిలింగలక్షణశేషకర్త 'కొన్నియెడలఁ దెనుఁగులమీఁది సాంస్కృతికకతపలకు గడదలు గానంబడియెడి' నని దీని నంగీకరించెను. తిక్కన, కేతన, నాచన సోమనాథుఁడు, శ్రీనాథుఁడు, రామరాజభూషణుఁడు మున్నగు సర్వలాక్షణికసమ్మతులగు ప్రామాణికులు పలువురు ప్రయోగించిన యీసంధిని గ్రాహ్యముగ నంగీకరించుటయే సమంజసము.

(10)

"..........................................టి

శ్వపతి యహీనబాహుబలసాగరుఁ డై

త్యపతుల నెల్లఁ ద్రుళ్ళడఁచె నారయ దృష్టఁ దదను నాసీనుఁ డై"

(నిర్వ-౫-౧౭)

ఇట విశేష్యము ద్వితీయాంతముగను, విశేషణము ప్రథమాంతముగను బ్రయుక్తమగుట విశేషము.















౧. శ్రీ జి. నరసింహారావుగారు(శ) ౨. శ్రీకొట్లా ప్రార్థ్యానందశర్మగారు(శ) 3. శ్రీతిరువీధుల వెంకటేశ్వరులుగారు(శ) ౪. శ్రీ కర్లపాలెం కృష్ణ రావుగారు(శ) ౫. శ్రీ వై. రంగనాయకులుగారు (శ) ౬. శ్రీ అవనిగడ్డ శేషయ్యగారు(శ) ౭. శ్రీ ధారా వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు(శ)













౧. శ్రీ కోపూరి సుబ్బరాయగుప్తగారు (కీ) ౨. శ్రీ జె. లక్ష్మీకాంతరావుగారు (కీ) 3. శ్రీ పి. రంగనాయకులుగారు (కీ) ౪. శ్రీ మొవ్వా ఆదినారాయణ చౌదరిగారు (కీ) ౫. శ్రీ జే. వి. సుబ్బారావుగారు (కీ) ౬. శ్రీ మద్ది వేంకటరంగయ్యగారు

చింతామణి 'షష్ఠీవిశేషణానాం ప్రథమా స్యాత్' అని షష్ఠ్యంతవిశేషణములకు మాత్రము ప్రథమను విధించుచున్నది. 'విభాషయా సుసన్తం స్యాత్తత్ర షష్ఠీవిశేషణమ్। ష్ఠ్యాద్యర్థవ్యవధానే తు భేద్యస్య నిఖిలం భవేత్' అను సథర్వణకారిక భిన్నార్థవ్యవధానమున విశేషణముల విభక్తు లన్నిటికిని ప్రథమను విధించెడిని. కవిసంశయవిచ్ఛేదమున

"అను నను క్రియతోఁ బాసియుఁ
దగఁ బెక్కువిభక్తులుం బ్రథమఁ జెందును భ
క్తగణపయమాన......"

(కవిసం-౧-౪౩)

అని సూరకవి యనుధాతువ్యవధానము లేకున్నను విశేషణవిభక్తు లన్నిటికిని బ్రథమ యగు నని నిర్ణయించెను.

"........నృపభ
ర్మోచయుఁ జెర్జునుతోఁ జను..."

(భార-ఆది-౬-౫౫)

"నాతండ్రి పరాశరసుతు
చేతం బడసితి ననుజ్ఞ..."

(భార-ఆశ్రమ-౧-౮౨)

అను నన్నయతిక్కనల ప్రయోగములు పయినిర్ణయమున కాధారములు. కేతనకవి యీవిషయమునఁ జింతామణి ననుసరించెను. (సర్వ-౧-విభక్తి-౪౪.) చిన్నయసూరి యథర్వణాచార్యుల ననువర్తించెను. (బాల-కారక-౨౭, ౨౮) ప్రౌఢవ్యాకరణకర్త ద్వితీయాదు లన్నిటికిని బ్రథమ యగు నని (ప్రౌఢ-కారక-౨౨) సూత్రించి ద్వితీయా తృతీయలకుఁ బ్రథమ నచ్చిన యుదాహరణములం జూపియుండెను. మఱియు నిట 'షష్ఠీవిశేషణానామ్' అను చింతామణిసూత్రము నందలి బహువచనమువలనఁ బ్రయోగబాహుళ్యము సూచితమగు చున్న దని యహోబలపండితుఁడు వ్రాసియుండ నాబహువచనమే ద్వితీయాదులకుఁగూడఁ బ్రథమను సాధించుచున్న దని నూతనసారస్యము నుద్ఘాటించియుండెను. అహోబలపండితునకు షష్ఠీతరంబుల ప్రథమ సాధువు గా దను నాగ్రహ ముండుటంబట్టియే 'ఆద్యుఁడు హిరణ్యగర్భునం దంతకంటె నిత్యాదికవితాపితామహాద్యు క్తిస్తు నిర్మూలైవ' యని నిరాకరించియుండెను. కేతనుఁడు నిరాకరించిన యీప్రయోగము త్రిలింగలక్షణశేషకర్త గుర్తింపక కానలయును వచనసూత్రమున కావశ్యకము దీనిని లక్ష్యముగాఁ గైకొనఁడయ్యె.

(11)

"వెలచి నిట్లంబుధినాథనందనులు దోర్వీర్యంబు సాలించి"

(నిర్వ-౫-౮౮)

'ప్రాయస్తు స్యాత్తిక్కమాదిక స్యైతిః' అను చింతామణి సూత్రము నందలి ప్రాయోగ్రహణముచే నిత్యసంధి క్త్వార్థకస్థలములఁ బ్రవర్తింపదని యహోబలపండితుఁడు వివరించెను. అథర్వణాచార్యుఁడు 'క్త్వార్థేతో న భవేత్సదా' యని క్త్వార్థకసంధిని సర్వథా నిషేధించెను. అప్పకవి

"పారిజాతనేత్ర క్త్వాప్రత్యయాంతార్థ
ములు నడిచు తెలుఁగు పలుకులకును
వైస్వరంబు లుండుపట్టులఁ బ్రకృతిభా
వంబు గాని సంధి వాటపడదు"

(అప్పక-౫-౮౨)

అని యీసంధిని నిషేధించెను. కాని యాతనికవితలో

"...విషదుగ్ధయుగ్మకుచయై యుద్దామురా కాసిక
త్తైజేఁ గిట్టంబుగఁ బాలు ద్రావుమిషచే..."

(అప్పక-౪-౩౨౩)

అని క్త్వార్థకసంధి దొరలియున్నది. కవిసంశయవిచ్ఛేదకారుఁడు 'ఇడఁగ నిచ్చుల్యప్పుపై నిత్యసంధి' (కవిసం-౧-౧౫) అని యీసంధి నంగీకరించి పెక్కులక్ష్యములఁ జూపియుండెను. వానిలోఁ గొన్ని భారతప్రయోగములును గలవు. కాని వాని కన్నిటికిఁ బాఠాంతరములు గానవచ్చెడిని. చిన్నయసూరి యీసంధిని స్పష్టముగ నిషేధించెను. ప్రౌఢవ్యాకరణమున నియ్యది యంగీకరింపఁబడెను. ఈసంధి నంగీకరించినవా రెల్లరును నీప్రకృతనిర్వచనోత్తర రామాయణపద్యమును 'వెలచి ట్లంబుధినాథనందను'ల నుమార్పుతో నుదాహరించియుండిరి. ఇం దేపాఠము తిక్కనకు సమ్మతమో నిర్ణయింప నాధారము లేదు. తాళపత్రములఁ బరిశీలించినను నీపాఠవిసంవాదము తొలంగదు.

(12)

"రాసాబసన నున్మత్తుం
డై సెంకింపక కడంగి యాతం డింతల్
సేసెఁగద చెడితి రిప్పలి
మీసల నయ్యాల లూఁగి మెయిమెయిఁ బోయెన్"

(నిర్వ-౬-౧౧)

ఇట 'సెంకింపక' యను పదము సకారప్రాసమున నిబద్ధమయి యున్నది. దీనిని దద్భవముగ నంగీకరింపవలయును. 'శంకించు' అను నది దీనిప్రకృతి. శసప్రాసము తిక్కనకు సమ్మతము గాకుండుటచే దీనిని సకారయుక్తముగనే యాతఁడు ప్రయోగించె ననుట నిర్వివాదము. ఇది సకారయుక్తముగ శబ్దరత్నాకరమునఁ జూపఁబడియుండవలసినది.

మఱియు నీపద్యమున 'మీసము'లను దాని తుదివర్ణము లోపించి 'మీసలు' అగుట వేఱొకవిశేషము.

(13)

"అడరి మెుఁ లిక్కడక్కడ వడిఁ దిరిగెన" (నిర్వ-౬-౧౨౧)

"ఇట్లు కమలషండ మిక్కడక్కడ నడ" (నిర్వ-౮-౬౪)

"అనుమానముతోడ నిక్కడక్కడ వడిసన్" (నిర్వ-౮-౧౦౦)

పయిపద్యములలో 'ఇక్కడక్కడ' అనుచోట 'ఇక్కడన్ + అక్కడన్' అని పదముల విభజించినచో సంధి గుర్తుటమగును. 'సంధిస్తు ద్రుతపూర్వస్య ప్రాయశో న భవే దతః' అని యప్పార్యుఁడును 'ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికంబులకు సంధి లే' దని చిన్నయసూరియు స్పష్టపఱిచిరి. విభక్తిలోపంబు గలుగుట కిట నామ్రేడితంబును లేదు. కావున నియ్యెడ సప్తమ్యర్థమునఁ బ్రాను వచ్చిన ట్లూహింపవలయును. ప్రౌఢవ్యాకరణకర్త జడంబులకు సప్తమ్యర్థమునఁ బ్రాను విధించి (ప్రౌ-కార-౨౦) యితరగ్రంథముల నుండి ప్రయోగములఁ జూపియుండెను. ఆవిధానమున నీప్రయోగములను బ్రమాణములు గానోపును.

(14)

"..........పయోజనూతిసం
తోసమున నాకలోకపతిఁ దోఁకొనిపోవు నెడన్..."

(నిర్వ-౭-౧౪)

సంతోషశబ్దమునుండి సంతోసము, సంతోసము, సంతసము నని మూఁడురూపము లేర్పడినవి. కవిసంశయవిచ్ఛేదమున,

"పరఁగ సంతోషశబ్దతద్భవము సేయఁ
జనును సంతోసమును సంతసం బటంచు
నిరుదెఱంగులఁ బలుకంగ నెల్లకృతుల
................................"

అని రెండే రూపములు సంగ్రహింపఁబడినవి. "ఆరాటాదులం బ్రథమే తరదీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు" (బాల-ప్రకీ-౧౧) నను సూత్రమున నారాటాదిగణమున 'సంతోసము' అనుదానిం జేర్చి 'సంతోసము' అనుదానిని సూరి సాధించియుండెను. శబ్దరత్నాకరకర్త పయిరూపములు మూఁటిని జేర్కొనియు సంతోస మనురూపమునకు విధిగాఁ జూపవలసిన ప్రయోగ మొక్కటియుం జూపఁడయ్యె. దాని కీప్రస్తుతప్రయోగము ప్రమాణముగ గ్రహింపఁదగును.

(15)

"...మదిని సరకు గొనక మఱచి యున్న
యెడను గొని దినములకున్"

(నిర్వ-౭-౬౩)

"అక్కటాదుల జడ్డకు లోపంబు విభాష నగు" (బాల-ప్రకీ-౮) ననుసూత్రమున నక్కటాదులలో, 'అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని' యను శబ్దములఁ బఠించి, 'అని, ఇని, ఎని, కొని' యను రూపాంతరములను జిన్నయసూరి సమ్మతించియుండెను. శబ్దరత్నాకరమున నీరూపాంతరము లన్నియుఁ జేర్కొనఁబడినవి. కాని యిట్టి విశేషరూపములకే ప్రయోగప్రదర్శన మత్యావశ్యకమై యుండ, 'అని' యనుదానికిఁ దక్క శేషించినవానికిఁ బ్రయోగములు నిర్దేశింపఁబడవయ్యె. అందు, 'కొని' యనుదానికిఁ బ్రస్తుతప్రయోగము సేకరింపవలయును.

(16)

"...రామశరణీపతి తి
న్ననివవ్వు మెఱయ నాతని
వినితిమి యిఁక నొకటి వినఁగ వేడుక యనుచున్"

(నిర్వ-౭-౯౫)

బాలవ్యాకరణముచే (క్రి-౫౮, ౫౯) వినుధాతువునకు భూతార్థకోత్తమపురుషబహువచనంబున వింటిమి, వినిరిమి యను రూపము లేర్పడును. అందు వినితిమి యనుదాని ప్రయోగ మరుదుగ నుండును. ప్రాసస్థాననిబద్ధ మగు ప్రస్తుతప్రయోగము దానికిఁ బ్రమాణ మగును.

(17)

"అతని రక్షణంబున నహర్నిశము దగ సా...
యేతరుపండు లొప్పు నవి యేటి నినంబునఁ దెచ్చి యిచ్చుచున్
................................" (నిర్వ-౭-౧౧౧)

ఇందలి తెరుపండు లనుచోఁ గేవలసంస్కృతమునకును నాచ్ఛికమునకును సమాసము గలిగిన దని కొందఱు భ్రమింతురు. కాని యిది యట్టిసమాసము గాదు. తెరుయొక్కయను తత్సమశబ్దము పండు లను దానితో నిట సమసించినది. తెరువుయొక్క మున్నగు నానిలో వృషణము లేకుండఁ దెరుయొక్క మున్నగు ప్రయోగములు భారతకాలమునుండి నేఁటిదనుకఁ బెక్కులు గానవచ్చును. వికృతివివేకము (ఆజంత-౨౪) కావ్యాలంకారచూడామణి (౯-౧౦౭) సర్వలక్షణసారసంగ్రహము (౧-విభక్తి-౮౩) బాలవ్యాకరణము (తత్స-౫౯) మున్నగు పెక్కులక్షణగ్రంథము లిట్టి పూర్ణబిందురహితరూపముల సాధించుచునే యున్నవి.

(18)

"నెమ్మనమున నినకులను గ్రహ
వమ్మగ నస్తుతులఁ బడయవలె నని తలఁచెన్"

(నిర్వ-౮-౮౩)

'వలయున్' అను దానిరూపాంతరమగు 'వలెన్' అను దానిని, దీని వ్యతిరేకరూప మగు 'వలదు' అనుదానిని లాక్షణికులు సాధించిన ట్లగపడదు. క్రియాపదప్రక్రియను వివరించిన చిన్నయసూరి భారత కాలమునుండియుఁ బ్రసిద్ధములగు నీరూపముల ముఖ్యముగ సాధింప వలసియుండెను. 'వలెన్' అనునది 'వలయున్' అనుదాని కాదేశ మని నిరూపించిన శబ్దరత్నాకరకర్త తన త్రిలింగలక్షణశేషమున దీని ప్రక్రియ నించుక పరామర్శించినను సమంజసముగా నుండెడిది.

(19)

"తొమ్మిదినూఱులు దొంబదితొమ్మిది (౯౯౯)
పద్యములం దనువసుమపట్టె"

(నిర్వ-౮-౮౪)

తొమ్మిదినూఱులమీఁద ననుటకుఁ దొమ్మనూటిమీఁద ననుట వింతప్రయోగము. సంఖ్యావాచకశబ్దప్రక్రియను సాకల్యముగ నే యాంధ్రలాక్షణికుఁడును జూపియుండలేదు.

(20)

"..............................వా
ల్మీకపల యాశ్రమంబునసమీపమునన్ మనకృత్యనిశ్చయం
బాకమలాక్షికిం దెలుపు మన్నృపాలకు నాజ్ఞసేసితిన్"

(నిర్వ-౯-౧౫)

ఇట 'ఆశ్రమంబున సమీపమునన్' అనుచో షష్ఠీతత్పురుషం బున నగాగమము వచ్చినది. ఈయాగమంబును బ్రౌఢవ్యాకరణకర్త సమాసపరిచ్ఛేదారంభమున విధించి భారతాదులనుండి ప్రయోగములఁ జూపియుండెను. ఇంకను నిర్వచనోత్తరరామాయణప్రయోగములు మఱికొన్నిటిని కొన్నిలక్షణములకుఁగా లాక్షణికులు గైకొనియుండిరి. వాని నన్నిటిం బరామర్శించుట యిట మనకుఁ బ్రసక్తము గాదు. నాయీవ్యాసము నుపక్రమణమున నిరూపించినరీతి నీగ్రంథమున ముఖ్యము లని నాకుఁ దోచిన ప్రయోగవిశేషములమాత్రము వివరించి యీవ్యాసము నింతటితో నుపసంహరింపఁదలంచితిని.

---

# ఆంధ్రభారత కవితా విమర్శనము

(ఆంధ్రగ్రంథమాల ౧౭-వ గ్రంథము) క్రౌను ౪౨౦ పుటలు. వెల రు. ౨-౦-౦.

గ్రంథకర్త: కోరాడ రామకృష్ణయ్యగారు, యం. ఏ. ప్రకాశకులు: ఆంధ్రగ్రంథమాల; ౭, తంబుశెట్టివీథి, చెన్నపురి.

ఈ గ్రంథమునందు విమర్శింపబడిన క్రిందివిషయములే దీని ప్రశస్తినిచాటును.

ఆంధ్రవాఙ్మయము; భారతము:—విమర్శనపద్ధతులు ఆంధ్రవాఙ్మయయుగములు ప్రాచీన దేశకాలపరిస్థితులు, చాళుక్యులకాలమున నాంధ్రభాషాస్థితి, అహదనకరశాసనములోని తెలుఁగుభాగము, చాళుక్యభీమరాజ దీర్ఘాసి యుద్ధమల్లాది శాసనములు, శిష్టభాష, జానుదెనుఁగు, భారతరచన-ఛందస్సామగ్రి, ప్రాచీనభాషాస్వరూపము-జన్యభాషలు.

మతస్థితి-వాఙ్మయము:—భారతరచన-అవతారికలు, నన్నయవైదికదృష్టికి నిదర్శనములు, నన్నయతరువాతి కాలస్థితి, ఆరణ్యపర్వశేషపూరణప్రశంస, ఆరణ్యపర్వశేషమునందలి తిక్కన యనుకరణములు. తిక్కన భారతరచన, అద్వైతభావము, యవతారికలు, కవితావేశము.

భారతాంధ్రీకరణము—తిక్కన:—విరాటపర్వకథ, అందలివస్త్వైక్యము, పాండవప్రవేశము, శమీవృక్షముపై నాయుధనిక్షేపణము, బృహన్నలసారథిగాఁగుదురుకొనుట, విరటునికొలువు-భీముఁడు, కీచకవధ తదనంతరవిశేషములు.

తిక్కనార్యుని కళాప్రతిభలు:—విరాటపర్వము—ప్రబంధలక్షణములు, మూలకథపై తిక్కనవేసినయాంధ్రతా ముద్ర, తిక్కనార్యునివర్ణనలు, ప్రకృతివర్ణనలు, తిక్కనమనోవృత్తివివరణశక్తి, నాటకకళాచాతుర్యము, తిక్కనశృంగారవర్ణనలు, రసపాత్రపోషణరీతులు, నాటకరీతులు, తిక్కనార్యునిభాషాశైలులు, పూర్వోత్తరసందర్భముల పొందిక, ఉపమాలంకారప్రయోగము, సందర్భానుకూలముగ భావమును స్ఫురింపఁజేయు పదరచన, జాతీయప్రయోగనైపుణ్యము, అర్థముమారిన ధాతువులు, పదజాలము, కారకవిశేషములు, ఉపసంహారము.

# ఆంధ్రవాఙ్మయవికాసతత్త్వము-ఆంధ్రభారత కావ్యోత్పత్తి

కందూరు ఈశ్వరదత్తుగారు బి. ఏ.,

ఏ మానవుఁడైనను దన స్వీయచరిత్రను వ్రాయఁబూనుకొనినచోఁ దనకష్టసుఖముల, కలిమిలేముల, గుణావగుణముల నెట్లు పూసఁగ్రుచ్చినట్లు వక్కాణించునో, యారీతినే సారస్వతమును ఆయాయుగముల రాజకీయపరిస్థితుల,మతావలంబనముల, సాంఘికాచారముల మానవమనోవృత్తుల నన్నిఁటిని బరిస్ఫుటము గావించును. ఆయాకాలముల సారస్వతము ఆయాకాలముల స్వీయచరిత్రమని మా మనవి.

ఒకజాతి వాఙ్మయస్వరూపపరిణామతత్త్వనిరూపమున కా దేశజుల రాజకీయమతసాంఘికార్థికపరిస్థితులను, నాగరికాభివృద్ధిని కావ్యనిర్మాణసమయములను జక్కఁగా పరిశీలింపవలెను. అట్టి స్థితిగతు లెప్పు డొకరీతిగ నుండనేరవు. కాలచక్రము క్రిందుమీఁదగుచుండును. వాఙ్మయోత్పత్తిపరిణామములు తత్కాలపరిస్థితుల నాశ్రయించియుండును.

## కృతికి విచ్ఛేదము లేదు

సామ్రాజ్యములు సమసిపోవచ్చును. మతనిర్మూలనము సంస్కర్తలు గావింపవచ్చును. సాంఘికవిప్లవములు సంభవింపవచ్చును. కాని కవిలేఖిని కడ్డు లేదు. కవియుఁ గృతియుఁ గల్పాంతము వఱకు నివసించువారె. ఈవిషయమై పిన వీరభద్రకవి జైమినీభారతము ప్రథమాశ్వాసములో మనోహరముగా నిట్లభివర్ణించెను:

ఉ. ఆదటునస్తసంతతులయందును నొక్కొకకాలమందు వి
చ్ఛేదము గల్గు నాఁటికిఁ జెప్ప విపర్యయ మేయుగంబున
న్లేదు కవిత్వసంతతికి నిక్కము తత్కవితా విలాసముల్
జాదులు నిష్టదైవము ప్రసాదము నా హరికీర్తనంబునన్.

ఇంకొక విశేషము: ఒక మానవుని రూపశీలములు తన జాతికుల మతముల ననుసరించియు, విద్యను బట్టియును గాక, అన్యజాతిమతకులసంపర్కములవల్లను, మనము నిర్ణయింప నలసియున్నది. అట్లే దేశముయొక్క సారస్వతము ఆదేశచరిత్ర ననుసరించియేగాక, విషయాంతరగ దేశసంపర్కముచేఁ గల్గిన మంచిచెడ్డల నాశ్రయించియుండును.

పైకారణముల నాదర్శముగ నుంచుకొని ప్రస్తుతకావ్యమైన భారతోత్పత్తికిఁ గారణములైన పరిస్థితులను సమగ్రముగాఁ బరిశీలింతము. ఆకాలమునాఁటి రాజకీయమతసాంఘికపరిస్థితు లేమి?

కృతికర్త నన్నయ. కృతిభర్త చాళుక్యభూపాలుఁడైన రాజరాజు. ఆంధ్రరాజ్యలక్ష్మి పూర్వచాళుక్యరాజేంద్రుల భుజముల నాశ్రయించియుండెను. క్రీ. శ. 973 సంవత్సరప్రాంతముల రెండవ అమ్మరాజవిజయాదిత్యుని త్రోసిరాజని, బాడపమహారాజు వేంగీరాజ్యము నాక్రమించుకొని, యిరువదిరెండేండ్లు పరిపాలించెను. అమ్మరాజసోదరుఁడైన దానార్ణవుఁడు బాడపునికడనుండి వేంగీరాజ్యమును గైవసము జేసికొనఁ బ్రయత్నించెను గాని విఫలమనోరథుఁ డయ్యెను. దానార్ణవున కిరువురు నందనులు. అందు ప్రథముఁడు మొదటి శక్తివర్మ. రెండవవాఁడు విమలాదిత్యుఁడు. శక్తివర్మ పశ్చిమచాళుక్యనృపాలుఁడైన తైలపదేవుని కుమారుఁడగు సత్యాశ్రయుని సహాయముతో నిజదేశముపై క్రీ. శ. 999 సంవత్సరప్రాంతముల దండువిడిచి, బాడపుని సంహరించి స్వరాజ్యమును దన భుజాబలసత్త్వముచే సంపాదించుకొనెను. కాని శక్తివర్మకు కష్టపరంపరల కోర్చి సంపాదించుకొనిన పైతృకరాజ్యమును నిలువఁబెట్టుకొనుటకుఁ బలప్రాణము తోఁకకు వచ్చెను. సామంతనాయకులు రాజద్రోహులై చెలరేఁగుటచే శక్తివర్మ తన దండనాయకుఁడైన దాశిభీముని సహాయముతో విప్లవకారుల నణఁచివైచి దేశ మరాజకము గాకుండఁగ నిలిపెను. శక్తివర్మ పుత్త్రహీనుఁడై క్రీ. శ. 1011 సంవత్సరప్రాంతముల స్వర్గస్థుఁడు కాఁగా నతని సోదరుఁడైన విమలాదిత్యుఁడు రాజ్యాధీశుఁ డయ్యెను.

ఈవిమలాదిత్యుఁడె భారతకృతిపతియైన రాజరాజుతండ్రి. ఇతఁడు తన మంత్రిశిఖామణియైన సత్రంపెగ్గడ సహాయముతో రాజ్యమందు శాంతి నెలకొల్పి దేశమును బదునొకండేండ్లు పరిపాలించెను. ఇతఁడు ముమ్మడిభీమబిరుదాంకుఁడు. మొదట శైవమతావలంబకుఁడు. తర్వాత జైనమతమును స్వీకరించెను. ఇతని భార్య నాముకాంబ జైనమతస్థురాలు. ఆకాలమున విశాఖపట్టణములోని రామతీర్థము జైనమతనిలయము. ఇచ్చట విమలాదిత్యుని జైనగురువైన త్రైలోక్య

యోగి సిద్ధాంతదేవుఁ డధివసించుచుండెను. ఆ జైనమఠమునకు మహారాజు యాత్ర గావించి, ఆమఠమునకు భూరిదానములఁ జేసెను. విమలాదిత్యుఁడు రాజరాజచోడుని కుమార్తెయైన కుందమాంబను బెండ్లాడెను. విమలాదిత్యుఁడు క్రీ. శ. 1022 సంవత్సరమునఁ గీర్తిశేషుఁ డయ్యెను.

తండ్రిమరణానంతరము రాజరాజు సింహాసనస్థుఁ డయ్యెను. ఇతఁడు విమలాదిత్యునకు కుందమాంబయందు జనించిన సుతుఁడు. విమలాదిత్యుని రాజ్యారంభముననె పూర్వచాళుక్యుల కష్టములు గట్టెక్కెను. చోళులతో సంబంధబాంధవ్యములు గలసెను. రాజ్యమునందు శాంతి నెలకొల్పఁబడుటచే ప్రజలు సౌఖ్యమును గాంచుచుండిరి. రాజరాజు తన మేనమామయగు రాజేంద్రచోడుని కుమార్తెయగు అమ్మంగదేవిని వివాహ మాడెను. చోళచాళుక్యబాంధవ్యమువలన పూర్వచాళుక్యరాజ్యమునకు దక్షిణదిశనుండి యేమాత్రము నొత్తిడి లేకపోవుటయేగాక చోళమైత్రి పూర్వచాళుక్యరాజ్యప్రశాంతికి కారణభూత మగుచుండెను. ఆకాలముననే తూర్పుగాంగవంశజుఁడగు వజ్రహస్తుఁడు పూర్వచాళుక్యరాజ్యమున కుత్తరమున నున్న కళింగరాజ్యమును బహుసమర్థుఁడై పాలించుచుండెను.

## బ్రాహ్మణమతోద్ధారణము

రాజరాజు పూర్వచాళుక్యనృపశిఖామణి. ఈ పూర్వచాళుక్యుల మత మేది? ఆకాలమున నాంధ్రదేశమునఁ బ్రబలియుండిన మత మేది? ఆంధ్రదేశము జైనబౌద్ధమతముల కాలవాలమై బౌద్ధమతాలయములతోను, జైనమఠములతోను నిండియుండెను. ఆంధ్రదేశమున అమరావతి, విజయవాటిక, రామతీర్థము ఈమతములకు కేంద్రస్థానములు. పూర్వచాళుక్యనృపాలురు జైనమతావలంబులై, జైనగురువుల నాదరించి, జైనమఠములకు దానముల గావించి జైనమతోద్ధారకులైరి. విమలాదిత్యుని జైనమతాభిమాన మిదివఱకె తెలిపియుంటిమి. పూర్వచాళుక్యరాజ్యారంభమున బౌద్ధజైనమతప్రాబల్యముచే నార్యమతము క్షీణించి, వైదికమతము ఆంధ్రభూమండలమున నంతరించిపోవు స్థితికి వచ్చెను. అట్టితఱి కుమారిలభట్టు జైనమతవిజృంభణము నణఁచివేసి వైదికమతోద్ధరణమును గావించెను. రాజరాజుకాలము నాఁటికి తెలుఁగుదేశమున వైదికమతము వ్యాప్తి చెందెను. చాళుక్యులు మొదటినుండియు బ్రాహ్మణభక్తులుగ నుండిరి. వీరి శాసనములలో పరమమాహేశ్వరుల మనియు, పరమభట్టారకుల మనియు, పరమబ్రహ్మణ్యుల మనియు వీరు చెప్పుకొనిరి. ఈ పరమబ్రహ్మణ్యబిరుదము పూర్వచాళుక్యనృపాలురగు విష్ణువర్ధనవిజయాదిత్యశక్తివర్మవిమలాదిత్యరాజరాజులకుఁ గలను.

## రాజరాజు బ్రాహ్మణమతాభిమానము

నన్నయభట్టు రాజరాజునుగూర్చి యొనర్చిన సంబోధనబిరుదావళిలో నీరాజన్యుని బ్రాహ్మణమతాభిమానము నెఱుఁగనగును.

క. విమలాదిత్యతనూజుఁడు
విమలవిచారుఁడు సమరవిద్యాకరుఁడు
త్తమచాళుక్యుఁడు వివిధా
గమవిహితశ్రముఁడు శుభంకరుఁ డురుకాంతిన్.

సీ. ..............................
బలిమి నీయని భూమివలయపతుల
నుక్కడఁగించుచు దిక్కుల దనయాజ్ఞ
వెలిఁగించుచు విప్రకులము నెల్లఁ
బ్రోచుచు శరణన్నఁ గాచుచు భీతుల
నగ్రజన్ములకు ననుగ్రహమున

ఆ. జాగుతరాగ్రహారము లిచ్చుచు
దేవభోగముల మహావిభూతిఁ
దనరఁజేయు నట్లు మనుమార్గుఁడగు విష్ణు
వర్ధనుండు వంశవర్ధనుండు.

మ. ఇవి యేనున్ సతతంబు నాయెడఁ గరం బిష్టంబులై యుండుఁ బ్రా
యవు భూదేవకులాభితర్పణమహాయత్క్రియున్ భారత
శ్రవణాసక్తియుఁ భారతీపతిపదాబ్జధ్యానపూజామహో
త్సవమున్ సంతతదానశీలతయు శశ్వత్సాధుసాంగత్యమున్.

క. ఆదిక్షత్రచరిత్రభ
రాదేవాశీఃపరంపరావర్ధితని
త్యోదయసత్యోదితవిమ
లాదిత్యతనూజ విక్రమాదిత్యనిభా!

క. శ్రీనాథమూర్తి విబుధని
ధానమహాదానతర్పితద్విజవర వేఁ
గీనాథపార్థనిభ యభి
మానమహార్ణవ, మహేంద్రమహిమాతిశయా!

## వర్ణాశ్రమోద్ధరణము

అట్టి బ్రాహ్మణప్రియుఁడును, బ్రాహ్మణమతాభిమానియు వర్ణాశ్రమోద్ధారణతత్పరుఁ డౌటకు లేశమైనను సందేహము లేదు గదా? అందువల్లనే రాజరాజిట్లభివర్ణింపఁబడెను:

ఉ. ఆశ్రితపోషణంబున ననంతవిలాసమునన్ మనీషివి
ద్యాశ్రమతత్త్వవిత్త్వమున దానగుణాభిరతిన్ సమస్తవ
ర్ణాశ్రమధర్మరక్షణమహామహిమన్ మహి నొప్పు సర్వలో
కాశ్రయుఁ డాదిరాజవిభుఁ డత్యకలంకచరిత్రసంపదన్.

## భారతకావ్యోత్పత్తిక్రమము

వైదికమతోద్ధరణమును, వర్ణాశ్రమధర్మపరిరక్షణము నెట్లు ప్రవర్ధమానము లగును? జైనమతప్రవిష్టు లగు ప్రజలకు ప్రబోధ మె

ట్లుపయోగించును? ఆకాలమున జైనమతాచార్యులు ప్రాకృతభాషలో ప్రజలకు మతమును బోధించుచుండిరి. అన్యమత మన్యభాషయందు బోధించినచో మతవ్యాప్తి కొనసాగు టెట్లు? ఈమతప్రచారము నరికట్టు, ప్రతిఘటించు మార్గము రాజరాజు గ్రహించెను. స్వమతమును స్వభాషయందె బోధింపవలెను. రాజరాజు అభిమతము భారతాంధ్రీకరణమూలమున నే యగును.

ఏలనన—భారతప్రశస్తి నన్నయభట్టు వర్ణించిన విధమును జూడుడు :

"వేదవ్యాసుండు నిజతపోమహత్త్వంబునం జేసి బ్రహ్మచేత ననుజ్ఞాతుండై, యష్టాదశపురాణంబులును, ధర్మశాస్త్రార్థతత్త్వంబులును, చతుర్వేదవేదాంతాభిప్రాయములును, చతుర్వర్గానుబంధబంధురకథేతిహాసంబులును, చతుర్వర్గమహార్షి రాజవంశచరితంబులును, చతుర్వర్ణాశ్రమధర్మక్రమంబులును, చతుర్ముఖప్రముఖనిఖిలసురమునిగణపూజితుండైన శ్రీకృష్ణుని మహత్త్వంబును, పాండవాదిభారతవీరుల మహాగుణంబులును, దన విమలజ్ఞానమయం బైన వాగ్దర్పణంబునం దేర్పడ వెలుఁగు చుండ,

సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు,
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్షణసంగ్రహ మని
యైతిహాసికు లితిహాసమనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసము
చ్చయంబని మహిఁ గొనియాడుచుండ
ఆ. వివిధవేదతత్త్వవేది, వేదవ్యాసుఁ
డాదిముని, పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు."

అట్టి భారతాంధ్రీకరణమె రాజరాజుమనోభీష్ట మిాడేర్చును. అదియునుఁగాక భారతశ్రవణాసక్తివిలాసుఁడు మన రాజరాజు.

చ. విమలమతిం బురాణములు వింటి ననేకము లర్థధర్మశా
స్త్రములు తెలిం గెఱింగితి నుదాత్తరసాన్వితకావ్యనాటక
క్రమముల పెక్కు సూచితి జగత్పరిపూజ్యములైన యీశ్వరా
గమములయందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితోన్.

వ. అయినను నాకు ననవరతంబును శ్రీ మహాభారతమునందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయై యుండు.

మ. ఇవి యేనుం సతతంబునాయెడఁ గరం బిష్టంబులై యుండుఁ, బాయవు భూదేవవరులాభిత ర్పణ మహీయప్రీతియుఁన్ భారత

శ్రవణాసక్తియుఁ బార్వతీపతిపదాబ్జధ్యానపూజామహో
త్సవముఁన్ సంతతదానశీలతయు శశ్వత్సాధుసాంగత్యమున్.

చ. అమలసువర్ణశృంగఖురమై కపిలంబగు గోశతంబు స
త్తమబహువేదవిప్రులకు దానముచేసిన నెత్ఫలంబు త
త్సమ మగుసూరు భారతకథాశ్రవణాభిరతిన్ మదీయచి
త్తము ననిశంబు భారతకథాశ్రవణప్రవణంబుగావునన్.

## వంశకర్తల మహిమాతిశయము

రాజనరేంద్రుని తండ్రియగు విమలాదిత్యుసకుఁ బూర్వులు వేంగీమండలమును బాలించిన ప్రాక్చాళుక్యప్రభువు లెవ్వరును దాము శీతాంశువంశీయులమని చెప్పుకొనకున్నను, విమలాదిత్యునినుండి పూర్వ చాళుక్యనరపతులు తమ శాసనములందు చంద్రవంశజులముగ వ్రాయించుకొనిరి. 'మన్యవైష్ణవునకు నామములు నుద్ధి' యనునట్లు నూతనసాంప్రదాయమును నిలుపఁ బెట్టుకొనఁ దలఁచిన వీరికి సోమవంశకర్తలును, చంద్రవంశోద్భవులు నగు పాండుభూపతుల యుదంతము వర్ణింపు భారతము గౌరవభాజన మయ్యెను. అందుచేఁ గాబోలుఁ రాజరాజు నన్నయభట్టు నుద్దేశించి యిట్లుపలికెను:

చ. హిమకరుదొట్టి పూరు భరత కురుప్రభుపాండుభూపతుల్
క్రమమున వంశకర్త లనఁగా మహి నొప్పిన యస్మదీయవం
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెంతయున్.

అట్టి భారతాంధ్రీకరణము సర్వభాషాసమంచిత్ [illegible] చాళుక్యకుల సంజాతుండైన నరపతికి హర్ష [illegible]!

## ఆకాలమున భారతపురాణప్రశస్తి

శ్వసురగృహాభిమానము మాదిరిమార్గులను [illegible] యుండెడు ననఁగా సామాన్యులగు మానవులకుండెడు [illegible] శంకరుఁడు హిమాలయమున నివసించెను. విష్ణుమూర్తి పాలసముద్రమున నిల్లు కట్టుకొనెను. చాళుక్యనరేంద్రులు చోళభూపాలురతో బాంధవ్యమును గల్పుకొన్న తర్వాత చాళుక్యులకు అత్తయింటివారనిన గౌరవము మెండయ్యెను. విమలాదిత్యుఁడు కుందవాంబను వివాహమాడి, తన కుమారుఁడును, భారతకృతిపతియు నైన రాజరాజునకు మామగారైన రాజరాజు పేరిడెను. రాజరాజు తన మేనమామకూతురు రాజేంద్ర చోడుని కుమార్తెను పరిణయమాడె, తనకుమారునకు మాతామహునిపేరైన రాజేంద్రచోడుని నామమిడెను. రాజరాజనకు [illegible] సాంప్రదాయ మబ్బెను. అతనికాలమున చోళమండలమున [illegible] కాలములో మహాభారతమొక [illegible] ముగ [illegible] కాక చాళుక్యాన్వయులె మహాభారత[illegible] కలవారై నట్లు చరిత్రవల్ల తెలియుచున్నది. [illegible] భారతకథాశ్రవణమునన నిష్టమై యుండెనో. ఆ సె పుట్టినింటివారి

రాజ్యమున నభిమానింపఁబడిన గ్రంథరాజమగుటచే- అరవసంపర్కము వల్ల రాజరాజు మాతృభాషను మఱచిపోక మాతృదేశోద్ధారకుఁడై, ఆంధ్రభారతస్వాతంత్ర్యోదయమునకుఁ గారణభూతుఁ డయ్యెను. మన మెల్లరము ధన్యులము. ఎందులకా? ద్రావిడసంపర్కముచే నెతనొందుచున్న యిప్పటి తెలుఁగువారికి తెలియదా?

## ప్రజల మనోభీష్టము

సంస్కృతమహాభారతమును జదివి బోధపఱచుకొనలేని సామాన్యజనులకు మాతృభాషయైన యాంధ్రమునం దామహాకావ్యము నన్నయతిక్కనలు తెనుఁగుఁజేసి, ప్రజలను గృతార్థులఁ గావించిరని మడికిసింగన్నయు, నెఱ్ఱాప్రెగ్గడయు వ్రాసిరి:

ఉ. భారతవేదవాక్యరసభారము లజ్ఞు లెఱుంగలేక ని
స్సారమనస్కులై తిరుగుచందముఁజూచి తెనుంగుబాస బెం
పార రచించి యందఱఁ గృతార్థులఁజేసిన పుణ్యమూర్తులన్
సారమతిన్ భజింతు ననిశంబును నన్నయతిక్కనాదులన్.

ఉ. భూసురభారతార్థముల భంగుల నిక్క మెఱుంగ నేరమిన్
గాసటబీసటే చదివి గాథల త్రవ్వ తెనుంగువారికిన్
వ్యాసమునిప్రణీతపరమార్థము తెల్లగఁజేసినట్టి య
జ్ఞాసనకల్పులన్ దలఁతు నార్యుల నన్నయతిక్కనార్యులన్.

## చాళుక్యనృపాలుర కావ్యగీతిప్రియత్వము

రాజరాజునకుఁ బూర్వము వేంగీదేశమును బాలించిన చాళుక్య మనుజాధీశులు తమశాసనములందు విద్యాకల్పతరులనియు, కవిగాయక కల్పతరులనియు వక్కాణింపఁబడిరి. నన్నయభట్టు రాజనరేంద్రుని విద్యాపోషకత్వమును, వైశిష్ట్యమును వివిధరీతుల వర్ణించెను.

క. శ్రీనవనితాస్వరూప భవేం
గీవిషయాధీశ కావ్యగీతిప్రియ నా
నావనినాథకిరీటత
టీవిలసద్రత్న సంఘటితపదకమలా!

క. రాజమహేంద్రకవీంద్రస
మాజసురక్ష్మాజ రాజమార్తాండ ధరి
త్రీజననుత చారిత్రవి
రాజితగుణరత్న రాజరాజనరేంద్రా! etc.

## అన్యభాషలలో భారతానువాదము

సంస్కృతభారతము ఇదివఱకె కన్నడభాషలో భాషాంతరీకరింపఁబడియుండెను. రాజనరేంద్రునకుఁ బూర్వము వేంగీమండల నాయకుఁడగు అరికేసరినృపాలుఁడు విక్రమార్జునవిజయమను పేర కన్నడభారతగ్రంథమును గృతినందెను. తత్కృతికర్త యరికేసరి సేనానియగు పంపాకయనువాఁడు ఈవిషయ మెఱింగినవాఁడగుటచేఁ గాబోలు

క. బహుభాషల బహువిధముల
బహుజనములవలన వినుచు భారతబద్ధ
స్పృహులగువారికి సెప్పుదు
బహుయాగంబుల ఫలంబు పరమార్థముగన్.

అని రాజరాజు మహాభారతమున వక్కాణించెను.

పైని వివరింపఁబడిన కారణముల ననుసరించి ఆంధ్రమహాజనులకు ప్రథమాంధ్రకావ్యమైన మహాభారతము లభించెను.

---

